SIMULTANEOUSLY PUBLISHED FROM VIJAYAWADA AND MADRAS

# ఆంధ్రపత్రిక

Regd. No H. 506 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO సంపుటం 53, సంచిక 39

విజయవాడ, సోమవారం 9-5-1966 THE ANDHRA PATRIKA MORNING *** 6 పుటలు : 10 పైసలు





# పశుగణాభివృద్ధిద్వారా ఆహారసమస్యాపరిష్కారం: ఎ. సి. సలహా

## ప్రజల ఆహారపు అలవాట్లు మార్పు చెందాలని కంకిపాడుసభలో విజ్ఞప్తి

### వ్యవసాయం లాభదాయకం కావాలంటే యంత్రాల వాడకం తప్పదని వివరణ

("ఆంధ్రపత్రిక ప్రతినిధి") కంకిపాడు, మే 8:

సంకర జాతి పశువులను తయారు చేసుకుంటేతప్ప పశుగణం అభివృద్ధి కాదని, ప్రజలు ఆహార పద్ధతులు మార్చుకొని మాంసం తినటం అలవాటు చేసుకుంటేతప్ప ఆహార సమస్య పరిష్కారం కాదని పశుపోషణ లాభదాయకం కాబోదన్న అభిప్రాయాన్ని వ్యవసాయ మంత్రి శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి నేడిక్కడ వ్యక్తం చేశారు.

ఈ రోజు ఉదయం కంకిపాడులో పశుగణాభివృద్ధి కమిటీ ఆధ్వర్యాన నిర్మింప ఈమాటలు అన్నారు.



బడిన ప్రాంతీయపశుజాతి అభివృద్ధి కేంద్ర భవనానికి, "నెహ్రూబ్లాక్"కు ప్రారంభోత్సవం చేస్తూ, ఆంధ్ర ప్రభుత్వ ఆహార, వ్యవసాయ శాఖ మంత్రి శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి

ఈ భవనాలకు 1964 ఏప్రియల్ నెలలో అప్పటి వ్యవసాయశాఖ మంత్రి శ్రీ ఎ. బలరామిరెడ్డి శంకుస్థాపన చేశారు. శ్రీ బలరామిరెడ్డి యీ నాటి ప్రారంభోత్సవానికి హాజరై 'శాస్త్రి' బ్లాకుకు ప్రారంభోత్సవం చేశారు. పశుసంరక్షక శాఖ డైరెక్టరు శ్రీ సి. కృష్ణారావు వెటరినరి బ్లాకుకు ప్రారంభోత్సవం చేశారు.

...అధ్యక్షులు శ్రీ పిడికిటి మాధవరావు స్వాగతం పలికి స్వాగతపత్రం సమర్పించారు. అందులో ప్రజలనుండి 50000 రూపాయలు విరాళం సేకరించి, ప్రభుత్వ సహాయంతో భవన నిర్మాణం పూర్తి చేశామని, యీ ప్రాంతంలో బాగా అభివృద్ధి పొందిన ముర్రా జాతి పాడిగేదెలను విజయవాడ సంయుక్త పాల సరఫరాపథకం అమలు కానందువల్ల పోషించలేక హైదరాబాదు, మద్రాసు మొదలగు పట్టణాలలో అమ్ముకోవాల్సి వచ్చిందని యిక్కడున్న పశువైద్యశాలలను పెరోచోటికి తరలించారని వివరించారు.

అంతకు ముందు శాసనసభ్యులు శ్రీ కాకాని వెంకటరత్నం జాతీయజెండాను ఆవిష్కరించి పశుపోషణ విషయంలో ప్రభుత్వం తగినంత శ్రద్ధ చూపటం లేదన్నారు.

సభాధ్యక్షులు శ్రీ పిన్నమనేని కోటేశ్వరరావు ప్రసంగిస్తూ పశు అభివృద్ధికి సంబంధించిన విషయాలలోనైనా అవసరమైన శాంక్షన్‌లలో ఆలస్యం నివారించాలని కోరారు.

డైరెక్టరు శ్రీ సి. కృష్ణారావు ప్రసంగిస్తూ ప్రభుత్వం, ప్రజలు కూడ వ్యవసాయ అభివృద్ధికి ఖర్చు పెట్టి కృషి చేస్తున్నారు కాని పశుసంపదపట్ల తగిన శ్రద్ధ చూపటం లేదన్నారు. గేదెపట్ల చూపిన శ్రద్ధ గోమాతపట్ల చూపటం లేదని, విదేశాలలోని జర్సి జాతి సంకరజాతి ఆవుల జాతిని తయారు చేసుకోవాలని సూచించారు. సంకరజాతి ఆవులను తయారు చేసుకుంటే వచ్చే 20 సంవత్సరాలలో పాలఉత్పత్తి 80శాతం పెంచవచ్చని, గేదెలను లేకుండా చేయవచ్చని సూచించారు.

శ్రీ ఎ. బలరామిరెడ్డి తమ ప్రసంగంలో గేదెలను లేకుండా చేసే ప్రయత్నం ప్రస్తుతం అంత మంచిది కాదని, సంకరజాతి పశువుల ప్రజలలో యింకా కొన్ని అనుమానాలు ఉన్నాయని, ఆ జాతితోపాటు ఆ జాతి రోగాలుకూడా దిగుమతి చేసుకుంటాం అనే భయం వారిలో ఉందని, ప్రచారం ద్వారా ఆ భయాన్ని పోగొట్టాలని సూచించారు. ...ప్రాంతంలో కేంద్రప్రభుత్వ సహాయంతో సాంద్ర పశుగణాభివృద్ధి కేంద్రాలు నెలకొల్పటం అవసరం అని సూచించారు. విజయవాడలోని ... పాలఫ్యాక్టరీకి 1967 జూన్ నెలలో భవనం పూర్తి అవుతుందని చెపుతున్నారని, అంతదాకా కూర్చోక వచ్చి వున్న యంత్రాలను భవనాలు నిర్మాణం అవుతుండగానే పూర్తి చేయవచ్చు అని సూచించారు.

శాసన సభ్యులు శ్రీ ఎం. లక్ష్మణస్వామి ప్రసంగించిన తరువాత శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి ప్రసంగించారు. శ్రీ ఎ. సి. తమ ప్రసంగంలో "ప్రపంచంలోని పశుగణంలో నాల్గవవంతు భారతదేశంలో ఉన్నాయి. అయినా ఆదాయం లేదు. లాభదాయకంగా ఉంటే తప్ప రైతు ఏ పని చేయడు. ఒకసారి లాభం రుచి చూస్తే యిక వదిలి పెట్టడు. మన దేశంలో పశువులను వ్యవసాయానికి పోకుండా, మేతమేయటానికి బయటకు ... పీడ వదుల్చుకొని విడివిడిగా వత్తే శ్రద్ధ తీసుకొనగల రోజు రాలేదు.

(మిగతా 2 వ పేజీలో)

## నాగార్జునసాగర్ పనికి ఆటంకం

### ముఖ్యమంత్రి ఆందోళన

("ఆంధ్రపత్రిక" ప్రతినిధి)

హైదరాబాద్, మే 8: మాచెర్ల సిమెంట్ ఫ్యాక్టరీ కార్మికుల సమ్మె ఫలితంగా పదిరోజుల నుంచి సిమెంట్ సప్లయి లేనందువల్ల నాగార్జునసాగర్ ప్రాజెక్టు డామ్ పని నిలిచిపోయినందుకు ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి తన ఆందోళన వ్యక్తం చేశారు.

...పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ ... అన్నారు.

కడెం నదీజలాలను గోదావరినదిలోకి వదిలే విషయమై కొందరు అగ్రనాయకుల మధ్య వివాదం వచ్చిన కారణంగా, దీనిపై ప్రభుత్వం దర్యాప్తు జరుపుతుందా? అని ప్రశ్నించగా, దీనిని గురించి తాను పరిశీలించలేదని ముఖ్యమంత్రి చెప్పారు.

తుంగభద్ర నదీజలాలు, ఇతర అంతర్ రాష్ట్ర సమస్యలపై మే 13 వ తేదిన తాను మైసూరు ముఖ్యమంత్రి శ్రీ నిజలింగప్పతో చర్చలు జరపగలనని ఆయన తెలిపారు.

### విశాఖలో ఉక్కుఫాక్టరికై ఆందోళన:

## ప్రధానివద్దకు ఆంధ్ర ఎం.పి.ల రాయబారం

### —శ్రీ తెన్నేటి ప్రకటన

("ఆంధ్రపత్రిక" ప్రతినిధి) హైదరాబాద్, మే 8:

విశాఖపట్నంలో ... ఉక్కు కర్మాగారాన్ని నెలకొల్పవలసిన అవసరాన్ని గురించి ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీకి విజ్ఞప్తి చేయడానికి గాను, ఆంధ్రప్రదేశ్ పార్లమెంటు సభ్యులంతా ఆమెను కలుసుకోనున్నారు.

ఈ విషయాన్ని నేటి సాయంకాలం ఒక బహిరంగ సభలో శ్రీ తెన్నేటి విశ్వనాథం ప్రకటించారు.

నేడు జరుగుతున్న ఉక్కు ఫ్యాక్టరీ దినోత్సవసందర్భంగా ఈ విషయంపై ఏర్పడిన ... సంఘానికి అధ్యక్షుడైన శ్రీ తెన్నేటి విశ్వనాథం వివేకవర్ధని కళాశాల ... ఏర్పాటైన బహిరంగసభలో ప్రసంగిస్తూ తాము ప్రజల అభిమతాన్ని ... వివరించేందుకు ... ప్రధాన మంత్రిని కోరామని, శ్రీమతి గాంధి సమాధానంకోసం ఎదురుచూస్తున్నామని చెప్పారు.

ఈ సభలో ... రిపబ్లికన్ పార్టీకి చెందిన ... శ్రీమతి ఈశ్వరీబాయి ... ప్రసంగించారు. కేంద్రం వెంటనే విశాఖలో ఉక్కు ఫ్యాక్టరీ విషయమై నిర్ణయం తీసుకోవాలని విజ్ఞప్తి చేస్తూ ఒక తీర్మానం చేశారు.

అంతేకాదు ప్రారంభ దశలో 15 లక్షల టన్నుల ఉత్పత్తి మేరకు ఉక్కు కర్మాగారాన్ని నెలకొల్పి, క్రమేపీ దానిని 45 లక్షల టన్నుల మేరకు పెద్దది చేయవచ్చునని కూడా ఆ తీర్మానంలో పేర్కొన్నారు. ఈవిషయాన్ని ఆంగ్లో అమెరికన్ నిపుణుల బృందం కూడ సిఫార్సు చేసివున్నది.

తిరువేంద్రం, మే 8: తూర్పుమండలం 'బి' డేవిస్‌కప్ టెన్నిస్ ఫైనల్స్ పోటీలో భారత్‌జట్టు సింహళంపై 3—0 ఆధిక్యత సాధించింది. నేటి డబుల్స్ పోటీలో ప్రేమ్‌జిత్‌లాల్, ఎస్. పి. మిశ్రాలు కలిసి ... కుమారా, బి. ఎస్. పింటోలను 6—3, 6—2 స్కోరుతో ఓడించారు.

## మిజో విద్రోహుల అత్యాచారాలు

షిల్లాంగ్, మే 8: 'మిజో విద్రోహుల గుంపులు ... దాడులు, దోపిడీలు, అత్యాచారాలు ఇంకా కొనసాగిస్తున్నారు. మిజో జిల్లానుఆనుకొని వున్న కచార్‌జిల్లా సరిహద్దు గ్రామాలపై వారు దాడులు జరుపుతున్నారు. అటవీశాఖకు చెందిన ఇద్దరు ... పై వారు దాడి జరిపి 750 రూపాయల రొఖ్ఖం ఇతర సామానులు దోచుకుపోయారు.

ఖాకీ దుస్తులు ధరించిన నలుగురు మిజో తిరుగుబాటుదారులు మొహికత్‌తేయాకు తోట సమీపంలో ఇళ్లపై ఏప్రిల్ 30వ తేదీ దాడి జరిపారు. వారిలో ఇద్దరిని గుర్తుపట్టగలమని అటవీశాఖ ఉద్యోగులు అన్నారు.

12 మంది మిజో తిరుగుబాటుదారులు మే 1న ఆ తేయాకుతోట సమీపంలోని అడవీశాఖ బంగళాపై దాడి జరిపి దోచుకుపోవటం చూచినట్లు కూడా వారు తెలిపారు.

కాచార్‌జిల్లా తేయాకు తోటల కార్మికుల ఇళ్లను తిరుగుబాటుదారులు దోచుకున్నట్లు కొన్ని వార్తలు అందాయి.

## అమెరికాలో చర్చలు ముగించి అశోక్ మెహతా ఢిల్లీ తిరిగి రాక

### 4 వ ప్రణాళికకు సోవియెట్ సహాయ విషయం తేల్చుకోవటానికి వచ్చేనెల మాస్కో ప్రయాణం

న్యూఢిల్లీ, మే 8:

భారత ప్రణాళికా మంత్రి శ్రీ అశోక మెహతా నాలుగవ ప్రణాళికకు విదేశ సహాయంపై అమెరికాలో మూడు వారాల చర్చల అనంతరం నేడిక్కడికి తిరిగి వచ్చారు.

ప్రణాళికకు సోవియట్ సహాయం విషయమై చర్చించు నిమిత్తం శ్రీ మెహతా వచ్చే నెలలో మాస్కోకు వెడతారు.

భారత్‌కు విదేశ సహాయావసరాలను గురించి అధ్యక్షుడు జాన్సన్‌తో సహా అమెరికా ప్రభుత్వ నాయకులతోను, ప్రపంచ బ్యాంకుఅధికారులతోను ఆయన వాషింగ్టన్‌లో చర్చలు జరిపారు. అట్టావా వెళ్ళి కెనడ ప్రభుత్వంతో కూడా ఆయన చర్చలు జరిపారు.

స్వదేశానికి తిరిగివస్తూ శ్రీ అశోక్ మెహతా లండన్, మాస్కోలలో కొద్దిసేపు ఆగారు.

అమెరికాలో తాను జరిపిన చర్చలను గురించి శ్రీ అశోక్‌మెహతా సోమవారం లేక బుధవారం నాడు పార్లమెంటులో ప్రకటన చేస్తారు.

కేంద్ర ఉపమంత్రులు శ్రీ యల్.ఎన్. మిశ్రా, శ్రీమతి యమ్. చంద్రశేఖర్ శ్రీ మెహతాకు స్వాగత మిచ్చారు.



## తాష్కెంట్ లో తిరిగి భూపకంపనలు

మాస్కో, మే 8: తాష్కెంటులో మరి ... భూమి కంపించిన ఫలితంగా ఆ నగరం దెబ్బతిన్నది.

ఏప్రిల్ 26 నాటి భూకంపం వల్ల కష్టనష్టాలకు గురిఅయిన వారి సహాయార్థం తక్షణ చర్యలకు సోవియట్ ప్రభుత్వం ఆదేశించింది.

ధనాన్ని, వస్తు వులను ... నిమిత్తం ఉజ్బెక్ ప్రభుత్వానికి సరఫరాచేస్తున్నారు.

## మద్రాసులో తీవ్రంగా వడగాలి

మద్రాసు మే 8: మద్రాసులో నిన్న నేడు ... వడగాలి వీచింది.

మీనంబాకం వాతావరణ పరిశోధనాలయంలో 106.4 డిగ్రీలు ఉష్ణోగ్రత ... రికార్డు ... వీచిన వడగాలి, తేమ, వాతావరణాన్ని తీవ్రతరం ...

... 2.45 గంటలకు ఉష్ణోగ్రత ... నమోదు ...

## విజయవాడలో ఉష్ణోగ్రత

విజయవాడ, మే 8: విజయవాడలో ... అత్యధిక ఉష్ణోగ్రత 115 ఫారిన్ హీట్ డిగ్రీలు వున్నది.

# "ప్రజల కొనుగోలు శక్తి తగ్గినప్పుడే ధరల తగ్గుదల"

## శ్రీ మొరార్జీ దేశాయ్ భాషణ

అహమదాబాద్, మే 8:

ప్రజల కొనుగోలు శక్తిని అదుపులో పెట్టగల్గియుంటేను, ఉత్పత్తిని అధికం చేయగల్గియుంటేను వస్తువుల ధరలు తగ్గగలవని మాజి ఆర్థికమంత్రి శ్రీ మొరార్జి దేశాయ్ నేడిక్కడ పేర్కొన్నారు

శ్రీ దేశాయ్ పత్రికాగోష్ఠిలో మాట్లాడుతూ, అభివృద్ధి చెందుతున్న ఆర్థిక వ్యవస్థలో ధరలు పెరగడం సహజమేనని అయితే ప్రభుత్వం ఒక స్థాయిలో వాటిని అదుపులో పెట్టవలసి ఉంటుందన్నారు.

ధరలు తగ్గాలని ప్రజలు కోరినట్లయితే, వినిమయ స్తోమతును ప్రభుత్వం అదుపులో పెట్టడానికి, ఉత్పత్తి అధికంచేసేందుకు కృషి సలపడానికి వారు సమ్మతించాలని ఆయన చెప్పారు.

ధరలను అదుపులో పెట్టాలన్న ఉద్దేశంతోనే ఆర్థికమంత్రిగా తాను నిర్బంధ పొదుపు పథకం, బంగారం కంట్రోలు ఉత్తర్వు మొదలైన చర్యలను తీసుకొన్నానన్నారు.

ఈ చర్యలవల్ల దేశానికి లాభంచేకూరగలదని, అయితే ప్రజలు ఈ విషయాన్ని గుర్తించలేకపోయారని ఆయన చెప్పారు.

"సంక్షేమ రాజ్యాన్ని మనం ఇంకా స్థాపించలేదు. కాని అందుకే మనం కృషిచేస్తున్నాము. ఆ లక్ష్యాన్ని సాధించడానికి కొంతకాలము బహుశా 20 సంవత్సరాలకుపైగా పట్టవచ్చును. అని శ్రీ దేశాయ్ అన్నారు.

గత 18 సంవత్సరాలలోను దేశం ఎలాంటి పురోగతిని సాధించలేదన్న విమర్శను ఆయన త్రోసిపుచ్చారు. ప్రజల ఆర్థిక పరిస్థితి ఆశించినంతమేరకుకాకపోయినా, కొంతవరకైనా మెరుగుపడిందన్నారు.

గత 20 సంవత్సరాలలోను దేశ సమస్యలను పరిష్కరించడంలో కాంగ్రెస్ విఫలమైనదనడం పొరబాటని ఆయన చెప్పారు.

కాంగ్రెస్ ... సమస్యలను పరిష్కరించడం...

ప్రజల ... కాంగ్రెస్ పట్ల ... ప్రజలకు విశ్వాసం పోయినదన్న విషయాన్నికూడా శ్రీ దేశాయ్ అంగీకరించలేదు.

తన అభిప్రాయంలో కాంగ్రెసుపార్టీ ... అన్నారు. కాంగ్రెస్ ప్రజల స్థితిని ఒక్క రాత్రిలో బాగుచేసే దేవత కాదని చెప్పారు.

## పరిపాలనా సంస్కరణల సంఘం నివేదిక

### 67 సెప్టెంబర్ కు సమర్పణ : మొరార్జీ దేశాయ్ వెల్లడి

అలహాబాద్, మే 8: పరిపాలనా సంస్కరణల సంఘం 1967 ఆగస్టు లేదా సెప్టెంబరు నెలనాటికి, కేంద్రప్రభుత్వానికి నివేదిక సమర్పించగలదని, సంఘం అధ్యక్షులు శ్రీ మొరార్జీదేశాయ్ నేడిక్కడ చెప్పారు.

సంఘం ఏర్పాటైన తర్వాత ఏడాదిలోగా నివేదిక సమర్పించాలని తాము మొదట్లో అనుకున్నామని, అయితే సంఘం కార్యకలాపాలకు సంబంధించిన కొన్ని విషయాలవల్ల నాలుగైదు మాసాలు కాల విలంబన జరిగినదని శ్రీ దేశాయ్ అన్నారు. సంఘం ఇప్పుడు తన కార్యక్రమాన్ని ప్రారంభించిందని, రానున్న ఎన్నికలలో సంఘం కార్యక్రమం వేగం తగ్గుతుందని, ఆయన చెప్పారు. అందువల్ల వచ్చే ఏడాది ఆగస్టు సెప్టెంబర్ నెలలవరకూ నివేదిక సమర్పణ సాధ్యం కాదని అన్నారు.

## రష్యన్ భాషలో టాగూర్ రచనలసంపుటి

కలకత్తా, మే 8:

రవీంద్రనాథటాగూర్ రచనల సంకలనాల రష్యన్ అనువాదాలలో 12 వ సంపుటి విశ్వ కవి జన్మదినోత్సవ సందర్భంగా యిటీవల విడుదల అయ్యిందని, సోవియెట్ కాన్సలేట్ జనరల్ విడుదల చేసిన పత్రికా ప్రకటన తెలుపుతున్నది.

ఈ సంపుటిలో విశ్వకవి 'స్మృతులు' రష్యా ... ఆయనకుపచ్చిన లేఖలు, 'గ్లింప్సెస్ ఆఫ్ బెంగాల్', గీతాంజలి, బర్న్‌ ... లోని ... ఉన్నాయి. ఈ సంపుటి 92,500 ప్రతులు అచ్చయింది.

ఇంతవరకు విశ్వకవి వ్రాసిన 150 రచనలు రష్యన్ భాషలో ప్రచురణ పొందాయి. ఈ రచనలు 50 లక్షల ప్రతులు అచ్చయినాయి. సోవియెట్ యూనియన్‌లో 22 భాషలలో ఈ రచనలు ప్రచురితమైనాయి.

## వాతావరణం

మద్రాసు, మే 8: శ్రీకాకుళం, విశాఖపట్నం, ఉభయ గోదావరి, ఖమ్మం, వరంగల్, నల్గొండజిల్లాలలో ఒకటి రెండు ప్రాంతాలలో, 10వ తేది ఉదయం లోపల ఒకమాదిరి జల్లులు పడవచ్చునని, మద్రాసులోని వాతావరణ పరిశోధనాలయం అధికారులు ప్రకటించారు. రాయలసీమలో ఆంధ్ర కోస్తా ప్రాంతాలలోని కొన్ని జిల్లాలలోనూ వాతావరణం పొడిగా ఉంటుంది.

## కృష్ణదేవరాయల కాలంనాటి నాణాలు

హైదరాబాద్, మే 8: రాయలక్ష్మణ బొమ్మల ముద్రలుకల శ్రీకృష్ణదేవరాయల కాలంనాటి 24 బంగారు నాణాల నిధి ఇటీవల మెదక్‌జిల్లాలోని బ్రాకిచిపియన్ గ్రామంలో బయటపడినట్లు ఇక్కడకు అందిన వార్తవల్ల తెలుస్తున్నది.

మల్లయ్య అనేవ్యక్తి గృహంలో గోడనిర్మాణానికి మట్టి త్రవ్వుతుండగా ఈ నాణాలు కనపడినవని తెలుస్తోంది.

ఈ నాణాలు విజయనగర రాజుల కాలంనాటివి. ఇవి శతాబ్దాలకితం భూమిలో కూరుకొనిపోయి వుండవచ్చు.

# గోఖలే సిద్ధాంతాలు ప్రజా ప్రతినిధులకు శిరోధార్యాలు: రాష్ట్రపతి ఉద్బోధ

న్యూఢిల్లీ, మే 8:

శాసనసభలకు, ఇతర ప్రజాసంస్థలకు అభ్యర్థులను నిర్ణయించే సందర్భంలో గోపాలకృష్ణగోఖలే మేధాశక్తిని, నైతిక బాధ్యతను స్మరించుకోవడం అవసరమని రాష్ట్రపతి డాక్టర్ రాధాకృష్ణన్ నేడు ఉద్బోధించారు.

గోపాలకృష్ణ గోఖలే శతజయంతి సందర్భంగా ఆయన ఆకాశవాణిలో జాతినుద్దేశించి ప్రసంగిస్తూ, నేడు దేశంలో పదవికి, సామర్థ్యంకాక, కులాలు, మతాల ప్రభావం ఎక్కువగా వున్నట్లు కనపడుతున్న దన్నారు. దేశంలో అశాంతి వాతావరణానికి ఇది ఒక కారణమని అన్నారు.

గోఖలే ప్రపంచపు సుఖాలను విడిచి, తన అద్భుతశక్తిని దేశసేవకు అంకితం చేసిన మహనీయుడని రాష్ట్రపతి అన్నారు. "ఆర్జించినదానివల్లకాదు, త్యజించినదానివల్లనే మానవులు గొప్పవారవుతారు. ప్రజాకార్యకలాపాలలో వున్నవారు దీనిని గొప్పగా భావించరాదు" అన్నారు రాష్ట్రపతి.

డా. రాధాకృష్ణ యింకా యిలా అన్నారు: "గోపాలకృష్ణ గోఖలే శతజయంత్యుత్సవ సందర్భంగా కొన్ని మాటలు చెప్పగలుగుతున్నందుకు ఆనందంగా వుంది. ఆయన తమ 49 వ యేటనే కీర్తిశేషులైనా, ఆయన ప్రభావం ప్రజాజీవితంమీద గొప్పగా, గణనీయంగా పడ్డది."

"దేశప్రేమ, విద్యాభ్యాసం అనుగుణంగా ఆ మహనీయుడు ప్రజాసేవకు త్యాగనిరతి అవసరమన్నది చేసిచూపి చెప్పాడు."

"ప్రపంచంలోనున్న ప్రతి వస్తువు మానవుని ఉపయోగంతో నిండి, అందుకున్నదిగాని స్వార్థత్యాగం ... "

"ప్రపంచంలోని సుఖం, సముపార్జనం అన్నీ శ్రీ గోఖలే ... ఆయన ... దేశసేవకు తమ యావజ్జీవితమును అంకితం చేశారు. మంచి జీవితానికి త్యాగమే సిద్ధాంతం."

—:o:—

## శ్రీమతి ఇందిర ఢిల్లీకి పునరాగమనం

న్యూఢిల్లీ, మే 8: రెండురోజులపాటు మహారాష్ట్రలో పర్యటించి శ్రీమతి ఇందిరాగాంధి నేడు తిరిగి విమానంలో ఢిల్లీ చేరుకున్నారు.

## అతివలకు ఇందిర యోగ్యతాపత్రం!

ఔరంగాబాద్, మే 8: అతివలు పురుషులకన్నా తక్కువవారని ఒక కవి అన్నందుకు, ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధి ... అన్నారు.

... హిందువు పురాణాలలోని దేవతలందరికన్నా మహాదేవి శక్తివంతురాలని ఆమె అన్నారు.

అయినా, ఆధునిక ప్రపంచంలో శక్తి సామర్థ్యాలను నిర్ణయించేది శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానంగాని లింగభేదం కాదని ఇందిర వాదించారు.

## ప్రజల ఆహారపు అలవాట్లు మారాలి

### హైదరాబాద్ సభలో మంత్రి శ్రీ చెన్నారెడ్డి సూచన

("ఆంధ్రపత్రిక" ప్రతినిధి)

హైదరాబాద్, మే 8: బలవర్ధక ఆహార పరిశోధనాలయం ఆవరణలో అంతర్జాతీయ విద్యార్థుల ... గృహానికి ఆర్థికమంత్రి డాక్టర్ ఎం. చెన్నారెడ్డి నిన్న సాయంకాలం ఇక్కడ ప్రారంభోత్సవం చేశారు.

... లక్షల రూపాయల ఖర్చుతో నిర్మించిన ఈ వసతిగృహంలో బలవర్ధక ఆహార పరిశోధనాలయం నిర్వహిస్తున్న ... 24 మంది విద్యార్థులకు వసతి సౌకర్యం సమకూరుస్తుంది.

ప్రతి ఏటా ఈ పరిశోధనాలయం నిర్వహిస్తున్న ... ఆగ్నేయాసియా దేశాలలోని ... మెడికల్ ఆఫీసర్లు శిక్షణ పొందుతున్నారు.

ఈ సందర్భంలో డాక్టర్ చెన్నారెడ్డి మాట్లాడుతూ, ప్రజలు ఆహారపుఅలవాట్లను మార్చుకోవలసిన అవసరం ... ఆహార సమస్య పరిష్కారానికి తోడ్పడాలని ఆయన చెప్పారు.

# చంద్రగోళంపై సైనిక కార్యకలాపాలు నిషేధం

## అంతర్జాతీయ ఒప్పందానికి జాన్సన్ సూచన: ఏ దేశం సార్వభౌమ్యహక్కు కోరరాదని విజ్ఞప్తి

శానంటోనియో, మే 8:

చంద్రమండలంపై సైనిక కార్యకలాపాలను నిషేధించి, దానిపై ఏ దేశమైనా సార్వభౌమ్య హక్కు ప్రకటించకుండా నివారించడానికి ఒప్పందం కుదుర్చుకోవాలని ... అధ్యక్షుడు జాన్సన్ విజ్ఞప్తి చేశారు.

ఈ ఒప్పందంపై అమెరికా, రష్యాలు, రోదసీ ప్రయోగాలు నిర్వహించే తదితర దేశాలు సంతకాలు చేయాలనీ, భూమికి అత్యంత సన్నిహితమైన చంద్రమండలంపైన నిరవరోధంగా పరిశోధనలు జరగటానికి వీలు కల్పించాలనీ ఆయన సూచించారు.

ఇతర దేశాలు ఈ ప్రతిపాదనపై ... తాము చర్చించవలసి ఉందని ఆయన పేర్కొన్నారు.

## పెట్రోల్ ఉత్పత్తి

# మత్స్యపరిశ్రమ కేంద్రంగా కాకినాడ అభివృద్ధి

## ప్రపంచబ్యాంకు నిపుణుల బృందం నివేదిక

("ఆంధ్రపత్రిక" ప్రతినిధి)

హైదరాబాదు, మే 7 : కాకినాడను సముద్ర గర్భమత్స్య పరిశ్రమ కేంద్రంగా అభివృద్ధి పరచడానికి ఎక్కువ అవకాశాలు కలవని ఆహార వ్యవసాయ సంస్థ, అభివృద్ధి పునర్నిర్మాణ వ్యవహారాల అంతర్జాతీయ బ్యాంకుకు చెందిన బృందం అభిప్రాయపడింది.

ఈ బృందం ఇటీవల విశాఖపట్నం, కాకినాడలలో పర్యటించింది. ఈ ప్రాజెక్టు గురించి ఈ బృందం ఈ నెలాఖరులోగా నివేదిక సమర్పించగలదని భావించబడుతున్నది.

ఈ ప్రాజెక్టు పథకం కార్యరూపం ధరిస్తే చిట్టచివరకు దానికి రూ 15 కోట్ల వరకు వ్యయం కాగలదు.

ఈ రాష్ట్రంలో ఇంతవరకు భారీఎత్తున సముద్రగర్భ మత్స్య పరిశ్రమ చేపట్టలేదని ప్రభుత్వప్రతినిధి ఒకరు నేడిక్కడ పత్రికల వారితో మాట్లాడుతూ చెప్పారు. కావున భారతలో సముద్రగర్భ మత్స్య పరిశ్రమ కేంద్రాలు అభివృద్ధి పరచడానికి గల అవకాశాలను పరిశీలించేందుకై, నిపుణుల బృందాన్ని పంపవలసిందిగా ప్రభుత్వం ప్రపంచ బ్యాంకును కోరింది. విశాఖపట్నం— కాకినాడ ప్రాంతం, టూటికొరిన్—మంగుళూరు గోవా ప్రాంతాలలో ఈ బృందం పర్యటించింది. కొచిన్, అండమాన్స్, విశాఖపట్నం సముద్ర ప్రాంతాలను చిట్టచివరకు సంబంధాలు ఏర్పాటు చేస్తూ కలపాలని నిర్ణయించారు. విశాఖపట్నం, కాకినాడలను సందర్శించిన ఈ బృందం, పూర్తిగా మత్స్య పరిశ్రమ కేంద్రమైన కాకినాడలో ఎక్కువ వనరులు బాగా ఉన్నాయని అభిప్రాయపడింది.

# భారత్ చైనా వివాదం

## వామపక్ష కమ్యూనిస్టు వైఖరి పునరుద్ఘాటన

కలకత్తా, మే 7 : వామ పక్ష కమ్యూనిస్టు పార్టీ పొలిట్ బ్యూరో సభ్యుడు శ్రీ పి. రామమూర్తి భారత్ చైనా వివాదం సంప్రదింపుల ద్వారా పరిష్కరింపబడాలన్న తన పార్టీ వాదాన్ని నేడిక్కడ పునరుద్ఘాటించారు. ఈ సంప్రదింపులకు భారత ప్రభుత్వం తనంతట తాను ముందుగా ఉపక్రమించాలని కూడా ఆయన అన్నారు.

వామపక్ష కమ్యూనిస్టు పార్టీ పొలిట్ బ్యూరో మూడు రోజుల సమావేశం నేడిక్కడ ప్రారంభం అయింది. భారత్—చైనా వివాదంపై తమ పార్టీ విధానం పునరాలోచించే సంకల్పం ఉన్నదన్న విషయాన్ని [illegible] జరిగిన పార్టీ [illegible] పొలిట్‌బ్యూరో ఏర్పాటు అయింది.

ఇది సమావేశం అవటం యిదే ప్రథమం. సార్వత్రిక ఎన్నికలు రానున్న సమయంలో వచ్చే నెల కేంద్ర కమిటీ సమావేశానికి సన్నాహాలు చేసేందుకు ఈ సమావేశం జరుగుతోంది. దేశం అంతటా పార్టీ నాయకుల విడుదల అయిన అనంతరం తొమ్మండుగురు సభ్యులు గల ఈ పొలిట్ బ్యూరో సమావేశం జరుగుతోంది.

కాంగ్రెసుకు వ్యతిరేకంగా ఎన్నికల ఒప్పందం గురించి చెపుతూ, తమ పార్టీ దీనికి సుముఖంగానే ఉందని అయితే కేంద్ర కమిటీ ఎన్నికల వ్యూహం రూపొందించి జాతీయ అంతర్జాతీయ సమస్యలపై విధానాలను రూపొందించిన మీదట గాని, సరియైన ప్రయత్నం జరుగదని శ్రీ రామమూర్తి పేర్కొన్నారు.

పార్టీ కేంద్ర కమిటీ జూన్ 12 నుంచి 19 దాకా సమావేశం అవుతుందని నేడు పొలిట్ బ్యూరో సమావేశంలో నిర్ణయించారు సమావేశం ఎక్కడ జరిగేది తరువాత నిర్ణయిస్తారు దానికి ముందుగా పొలిట్ బ్యూరో మరో సమావేశం జరుపుతుంది. తమ పార్టీ ప్రధాన కార్యాలయాన్ని ఢిల్లీ నుంచి కలకత్తాకు మార్చాలని కూడా పొలిట్ బ్యూరో నేడు నిర్ణయించింది. వామపక్ష కమ్యూనిస్టు పార్టీకి కలకత్తా ముఖ్య కేంద్రం.

# హిల్టన్ కంపెనీ హోటలు విషయం

## సంజీవరెడ్డి వివరణ

న్యూఢిల్లీ, మే 7 : బొంబాయిలో ఒక ప్రయివేటు సంస్థతో కలిసి ప్రఖ్యాత అమెరికన్ హిల్టన్ హోటళ్ల కంపెనీ ఏర్పాటు చేయనున్న హోటలుకు సంబంధించి, నేడు రాజ్యసభలో సభ్యులు భిన్నాభిప్రాయాలు వెలిబుచ్చారు.

పాత గ్వాలియర్ భవనము ప్రాంతంలో స్థాపింపబడనున్న ఈ పెద్ద వసతిగృహానికి (హోటలు) అమెరికలోని హిల్టన్ కంపెనీ సహాయం ఇచ్చే విషయం, ప్రభుత్వం సూత్రప్రాయంగా మాత్రం అంగీకరించింది అని, దేశం ప్రయోజనాలు అని పూర్తిగా పరిశీలించినతర్వాతనే ఆమోదం ఇవ్వడం జరుగుతుందని పౌర విమానయాన, టూరిజం శాఖల మంత్రి శ్రీ సంజీవరెడ్డి వివరించారు.

శ్రీయుతులు ఎం.పి. భార్గవ, చంద్రశేఖర్‌లు తెచ్చిన సవరణ తీర్మానానికి శ్రీ సంజీవరెడ్డి సమాధానం చెబుతూ, హిల్టన్ కంపెనీకి దేశంలో అనేక హోటళ్లు పెట్టే అవకాశమేదీ కల్పించదలుచుకోవడం లేదని చెప్పారు. ప్రభుత్వరంగంలో ఇట్టి పెట్టుబడికి అవకాశం ఇచ్చే యోచనకూడా లేదని బొంబాయిలోని శివసాగర్ ఎస్టేటువారికి, హిల్టన్ కంపెనీవారికీ మధ్య ఈ ఏర్పాటు జరుగుతున్నది అని ఆయన చెప్పారు.

# మాచెర్ల సిమెంట్ ఫ్యాక్టరీలో సమ్మె

## చట్టవిరుద్ధమైనదని రాష్ట్రప్రభుత్వ ప్రకటన

("ఆంధ్రపత్రిక" ప్రతినిధి)

హైదరాబాద్, మే 7 : మాచర్లలోని రామకృష్ణ సిమెంట్ కంపెనీ కార్మికులు చేస్తున్న సమ్మె చట్టవిరుద్ధమైనదిగా రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించింది. ముఖ్యంగా మాచర్ల ఫ్యాక్టరీ ప్రజోపయోగకర సంస్థ కావడంవల్ల కార్మికులు అలాంటి చర్యకు దిగకుండా ఉండవలసిందని ప్రభుత్వం భావించింది.

నేటి సాయంకాలం విడుదలచేసిన పత్రికా ప్రకటనలో పై విషయాలు పేర్కొన్నారు. యజమానులు, కార్మికులు మధ్యగల వివిధ సమస్యలను వారే పరిష్కరించుకోవాలని చేసిన ప్రయత్నాలన్నీ మంత్రుల స్థాయిలో కూడా విఫలమైనందున ఈ వివాదాన్ని పరిష్కర్తృ తీర్పుకు నివేదించారు.

చట్ట ప్రకారం నోటీసు ఇవ్వకుండ ఏప్రిల్ 29నుంచికార్మికులుసమ్మెచేస్తున్నారు.

# తుంగభద్ర ప్రాజక్టు

## రెండవ దశ నిర్మాణంపై మైసూర్, ఆంధ్ర చర్చలు

హైదరాబాదు, మే 7 : తుంగభద్ర ఎగువ కాల్వ ప్రథమ దశ వచ్చే జూలైలో పూర్తి అయిన వెంటనే రెండవ దశ నిర్మాణాన్ని చేపట్టడాన్ని గురించి ఆంధ్రప్రదేశ్, మైసూరు ముఖ్యమంత్రులు యీ నెల 12వ తేదీన చర్చలు జరుపుతారు.

ఈ ప్రాజెక్టు రెండవ దశ వల్ల ఆంధ్రలో సుమారు 150 వేల ఎకరాలకు, మైసూరులో లక్ష ఎకరాలకు లాభం చేకూరుతుంది.

ప్రథమ దశ పూర్తయిన వెంటనే రెండవ దశ నిర్మాణం ప్రారంభం కావాలని ఆంధ్రప్రదేశ్ అభిలషిస్తున్నట్లు ప్రభుత్వ ప్రతినిధి ఒకరు నేడిక్కడ చెప్పారు. రెండవ దశ నిర్మాణానికి గాను తుంగభద్ర ప్రాజెక్టు బోర్డును కొనసాగించడాన్ని గురించి గాని, అంతర్ రాష్ట్రీయ కంట్రోల్ బోర్డును ఏర్పాటు చేయడం గురించి గాని ఇరారు నిర్ణయం ఏదీ తీసుకొన లేదని కూడా ఆయన చెప్పారు.

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రితో నదీ జలాల వివాదంపై చర్చలు జరిపేందుకుగాను కేంద్ర నీటిపారుదల శాఖామంత్రి శ్రీ ఫకృద్దీన్ ఆలీ అహ్మద్ యీ నెల 13న యిక్కడికి వస్తున్నారు. అంతకు ముందు రోజు సాయంకాలమే ఉభయ రాష్ట్రాల ముఖ్య మంత్రులు సమావేశం అవుతున్నందున, నదీ జలాల వివాదాన్ని వీరు చర్చించవచ్చు.

# విమాన సిబ్బందికి వాయుసేన పతకాలు

ఆగ్రా, మే 7 : నేడిక్కడ జరిగిన ఒక ఉత్సవంలో వైమానిక దళానికి చెందిన పదిమందికి వాయుసేన, విశిష్టసేవా పతకాలను వైమానికదళం ప్రధానాధికారి ఎయిర్ మార్షల్ అర్జున్‌సింగ్ బహూకరించారు.

ఈ పతకాలను పొందిన వారి పేర్లివి : శాంతికాలంలోనూ, యుద్ధ సమయంలోనూ వింగ్ కమాండర్ అరవింద్‌దలయా, స్క్వాడ్రన్ లీడర్ పి.కె. కౌల్, ఫ్లయిట్ లెఫ్టినెంట్ ఎస్.ఎన్. సవానె, ఫ్లయిట్ లెఫ్టినెంట్ డి.జె. వరుల్కర్ (వీరంతా వాయుసేన పతకాలు పొందారు.) వారంట్ ఆఫీసర్లు : డి.బి. రామకృష్ణ, రఘువీర్‌సింగ్, ఫ్లయిట్ సార్జంట్స్ : కె.ఎన్. ముఖర్జీ, అమోలాల్‌సింగ్, ఎన్. చంద్రశేఖరన్, సార్జంట్ బి. గోవిందరావ్ (వీరంతా మూడవశ్రేణి విశిష్టసేవ పతకాలు పొందారు.)

# కేదారేశ్వర పేటలో అగ్నిప్రమాదం

విజయవాడ, మే 7 : ఎనిమిది వాటాళ్లు గల పెద్ద పాక ఒకటి యీ సాయంత్రం సుమారు 5—30 గంటలప్పుడు యిక్కడ కేదారేశ్వరపేటలో అగ్ని హోత్రుడికి ఆహుతి అయి పోయింది.

# భారత్, యుగోస్లావియా ఈజిప్టు అధినాయకసమావేశం

## నాసర్ టిటోల ప్రకటన

## చర్చలు అత్యంత ప్రయోజనకరమని వివరణ

అలెగ్జాండ్రియా, మే 7 : యుగోస్లావియా అధ్యక్షుడు మార్షల్ టిటో నేడు ఇక్కడ ఒక పత్రికా గోష్ఠిలో మాట్లాడుతూ ఐక్య అరబ్‌రిపబ్లిక్ అధ్యక్షుడు శ్రీ నాసర్‌కు, భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధికి తమకు మధ్య త్రయ నాయక సమావేశం జరగటం తాము హర్షించగలమని ప్రకటించారు.

ఈ గోష్ఠిలో అరబ్ రిపబ్లిక్ అధ్యక్షుడు శ్రీ నాసర్‌కూడ పాల్గొన్నారు. పై అధినాయక త్రయ సమావేశంగురించి శ్రీ నాసర్ కూడా హర్షం వెలిబుచ్చారు. శ్రీ టిటో అరబ్‌రిపబ్లిక్‌లో తమ 6 రోజుల పర్యటన ముగించుకొని తమ దేశానికి నౌకలో తిరిగి బయలుదేరేముందు ఈ విలేఖరుల గోష్ఠి ఏర్పాటయింది.

తమ సంభాషణలలో విబంధ రాజ్యాధినేతల సమావేశం త్వరలో ఏర్పాటుచేసే అవకాశాల గురించి తాము చర్చించలేదని ఉభయ దేశాల అధ్యక్షులు వెల్లడించారు. అయితే, ఈ విబంధ రాజ్యాల నాయకులు ఇద్దరిద్దరు కలసి సమావేశం అవుతూ ఉండటం మేము ఇష్టపడతాం అని వీరుభయులూ చెప్పారు.

శ్రీ నాసర్‌కు శ్రీమతి ఇందిరాగాంధికి, తమకుమధ్య సమావేశం, పరిస్థితులు వక్రమంగా ఉన్నప్పుడు ప్రయోజనదాయకం కాగలదని యుగోస్లావియా అధ్యక్షుడు అన్నారు. ఆ సమావేశం ఎక్కడ జరపవలసినదీ ఇంకా ఇదమిత్థంగా అనుకోలేదు అనికూడా శ్రీ టిటో అన్నారు. శ్రీ నాసర్‌వద్ద సెలవు తీసుకుంటూ తిరిగి వేసవిలో మిమ్మల్ని కలుస్తానని అనడం వలన ఈ సమావేశం వేసవిలో జరగటానికి అవకాశం ఉన్నట్లు మార్షల్ టిటో సూచించారు.

అణ్వాయుధ వ్యాప్తి నిరోధం గురించి సక్రమమైన ఒప్పందం ఏదైనా జరగటానికి అణ్వాయుధ రాజ్యాలు అన్నిటితోపాటు చైనానుకూడా కలుపుకోవాలని ఉభయ అధ్యక్షులూ ఏకీభావం ప్రకటించారు.

ఈవిషయంలో ఐక్య అరబ్ రిపబ్లిక్ పెకింగ్‌తో వ్యాపారసంబంధం సాగించేఅవకాశంఉన్నది.

ఆగ్నేయ విభాగంలో విబంధ రాజ్యాల మూడో సమావేశం ఏర్పాటు కావాలన్న సూచనలను మార్షల్ టిటో తోసిపుచ్చారు.

శ్రీ నాసర్‌కు తమకు ఇక్కడ జరిగిన సంభాషణలవంటి రెండు రెండు విబంధ దేశాల సమావేశాలు కొనసాగటం వాంఛనీయం అని తమ పత్రికాగోష్ఠిలో శ్రీ టిటో అన్నారు. ఇట్టి సంభాషణలు భారీయెత్తున విబంధ రాజ్యాల సమావేశం ఏర్పాటుకు దారితీయ వచ్చని ఆయన అన్నారు.

# అమెరికా ఆర్థిక సహాయం

## అశోక్ మెహతా చర్చల ఫలితాలు

వాషింగ్టన్, మే 7 : భారత్‌కు వర్తమాన సంవత్సరానికి లభించే సహాయం పరిమితి తేలటానికి కొంతకాలం పట్టినా, దిగుమతుళ్లను పెంపొందించేనిమిత్తం, ప్రాజెక్టులలో ప్రమేయం లేని సహాయం అమెరికా నుంచి లభించగలదని శ్రీ అశోక్ మెహతాకు వాషింగ్టన్ చర్చల వల్ల నమ్మకం కలిగింది.

ఈ సంవత్సర కాలానికి భారత్ తలపెట్టిన కార్యక్రమాలను నిరాఘాటంగా కొనసాగించవచ్చుననీ, నాలుగవ ప్రణాళికకు తుదిస్వరూపం కల్పించవచ్చుననీ కూడా ఆయనకు నమ్మకం కలిగింది.

అమెరికన్ అధికారులు, ప్రపంచ బ్యాంకు నిర్వాహకులతోనే కాక కెనడా వెళ్లి అక్కడి నాయకులతో సైతం శ్రీ మెహతా చర్చించారు.

ఈ సంవత్సరంలోనే శ్రీ అశోక్ మెహతా బాన్, పారిస్, లండన్, మాస్కో, బెల్గ్రేడ్‌లను కూడా సందర్శించనున్నారు.

ఇక్కడనుంచి నిన్న న్యూయార్క్‌కు బయలుదేరే ముందు శ్రీ అశోక్‌మెహతా మరో సారి జార్జివుడ్స్‌ను కలుసుకొన్నారు. భారత్‌కు సహాయం విషయం ప్రపంచ బ్యాంకు వైఖరిని గురించి వచ్చేవారం పార్లమెంటులో చేసే ప్రకటనలో పేర్కొన దగిన అంశాలకు తుది రూపం కల్పించే విషయం వారు చర్చించారు.

వచ్చేవారం పార్లమెంటులో ప్రకటన చేసే ముందు, అమెరికా అభిప్రాయం గురించి తాము చెప్పాలనే దానిపై వైట్ హవుస్ అనుమతిని ఆయన పొందవలసి ఉన్నది.

నాలుగవ ప్రణాళికా కాలానికి భారత్ కోరుతున్న మొత్తం సహాయంలో నాలుగింట మూడువంతులు అమెరికానుంచి, ప్రపంచ బ్యాంకు ద్వారానే లభించవలసి ఉన్నది. ఆ విషయం అమెరికాకు కూడా తెలుసు.

భారత్‌లో స్వేచ్ఛాయుత వాణిజ్య వ్యవస్థ ఉండాలని అమెరికా, ప్రపంచ బ్యాంకు అభిమతం. ప్రణాళికాబద్ధమైన ప్రజాస్వామ్య సోషలిస్టు వ్యవస్థగా ఉండాలని భారత్ అభిమతం. వాషింగ్టన్‌లో మూడు వారాలుగా చర్చలు జరిగినా, ఉభయ పక్షాలలో ఎవరి వైఖరి మారలేదు. కాని కార్యాచరణకు సంబంధించిన సమస్యలపై ఉభయపక్షాల వారు కొంతవరకు ఏకాభిప్రాయాన్ని సాధించగలిగారు.

మద్రాసు, మే 7: శ్రీ గోపాలకృష్ణగోఖలే శత జయంతి మే 9 వ తేదీని ప్రభుత్వ కార్యాలయాలకు శెలవుదినంగా మద్రాసు ప్రభుత్వం ప్రకటించింది. గోఖలే శత జయంత్యుత్సవాలు దేశవ్యాప్తంగా జరుగుతాయి.

# 'దేశ శ్రేయస్సుదృష్ట్యానే విదేశ సహాయాన్ని కోరుతున్నాం'

## — ఇందిరాగాంధి ప్రకటన

నాగపూర్, మే 7 : ఎలాంటి విదేశ దురాక్రమణలనయినా ఎదుర్కొనేందుకు దేశాన్ని పటిష్టం చెయడంలోను, స్వయంసమృద్ధిని సాధించడంలోను ప్రభుత్వంతో పూర్తిగా సహకరించవలసిందని దేశ ప్రజలకు ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధి నేడు విజ్ఞప్తి చేశారు.

ఇక్కడ కస్తూర్‌చంద్ పార్కులో జరిగిన బ్రహ్మాండమైన బహిరంగసభలో మాట్లాడుతూ ప్రపంచంలో సమస్యలు లేని దేశం ఏదీ లేదని, అనేక కారణాల—ముఖ్యంగా దారిద్ర్యంవల్ల వెనుకబడిన దేశాలు అనేక సమస్యలను ఎదుర్కొనవలసి వస్తుందని శ్రీమతి గాంధి అన్నారు.

మన సమస్యల పరిష్కారానికిగాను విదేశాల సహాయం కోరడాన్ని విమర్శించినవారిని శ్రీమతి గాంధి విమర్శిస్తూ, ప్రపంచంలో ఏ దేశమూ కేవలం తన కృషిపైనే ఆధారపడి అభివృద్ధి సాధించలేదని, అన్ని దేశాలూ తమ అభివృద్ధికి ఇతరులనుంచి సహాయం పొందాయని అన్నారు.

చైనా, పాకిస్తాన్ దురాక్రమణ వల్లను, వర్షాలు కురవకపోవడమువలనను భారత దేశం అనేక సమస్యలను ఎదుర్కొనవలసి వచ్చిందంటూ అందువల్ల విదేశాల సహాయాన్ని కోరవలసి వచ్చిందన్నారు. దేశం బలహీనత, నిస్సహాయతలవల్ల సహాయంపొందడం తప్పు అన్నారు. భారతదేశానికి సంబంధించినంత వరకు కొంతవరకు ఇది నిజమే అన్నారు. అందువల్ల విదేశాల సహాయము నిలిపివేసేలక్ష్యంతో కృషిచేయాలనీ అయితే దేశంలోని ప్రజ అంతా సమిష్టిగా కృషిచేసి, పరస్పరం సహకారంతో వ్యవహరించినప్పుడు మాత్రమే ఇది సాధ్యమనీ ఆమె అన్నారు. ప్రస్తుత పరిస్థితులలో కొన్ని మిత్రదేశాలనుంచి భారతదేశం సహాయం తీసుకొనకపోతే, దేశప్రజలు ఎంతో బాధపడవలసి వస్తుందన్నారు.

తాష్కెంట్ ఒప్పందాన్ని ప్రస్తావించి పాకిస్తాన్ విరుద్ధంగావ్యవహరిస్తున్నప్పటికీ, భారత దేశం ఈ ఒప్పందానికి కట్టుబడి ఉంటుందన్నారు.

ఆమె ఇంకా ఇలా అన్నారు : "అంటే భారతదేశం మాట్లాడకుండా వూరుకుంటుందనికాదు. పాకిస్తాన్‌తోపాటు, ఉత్తర సరిహద్దునుండికూడా వాతావరణం అనుకూలముగాలేదు. తరచు భారతదేశంపై బెదరింపులు వినవస్తున్నాయి. అందువల్ల చైనానుంచి గాని, పాకిస్తాన్‌నుంచిగాని ఎలాంటి దురాక్రమణనయినా ఎదుర్కొనడానికి దేశం సర్వదా సిద్ధంగా ఉండాలి. దేశరక్షణను పటిష్టం చేయడానికి దేశం ముందు వ్యవసాయ పారిశ్రామిక రంగాలలో శీఘ్రముగా అభివృద్ధి చెందాలి".

"దేశం నేడు ఎదుర్కొంటున్న వివిధ సమస్యలను: సోషలిజాన్ని నెలకొల్పడంద్వారా మాత్రమే పరిష్కరించగలం. స్వాతంత్ర్యం తర్వాత దేశం అభివృద్ధి ఏమీ చెందలేదని కొన్ని ప్రతిపక్షాలవారు విమర్శిస్తున్నారు. ఈ విమర్శ దేశప్రజలకే అవమానం. ప్రజల సహకారంతో ప్రభుత్వం ఎంతో అభివృద్ధిని సాధించింది. అమెరికావంటి సంపన్న దేశాలలో కూడా సమస్యలున్నాయి. అమెరికాలో దారిద్ర్య నిర్మూలనకు జాన్సన్ ఒక పథకాన్ని రూపొందించారు.

"దేశం ఎదుర్కొంటున్న సమస్యల దృష్ట్యా భారతదేశంలో ప్రజాస్వామ్య మనుగడను గురించి ఎన్నో దేశాలు చూస్తున్నాయి. మనదేశం తర్వాత స్వాతంత్ర్యం పొందిన అనేక దేశాలు తమ ప్రజాస్వామ్య విధానాన్ని విడనాడడమే ఇందుకు కారణం. నేడు భారతదేశానికి ఒక పరీక్షా సమయం. ప్రజల సహకారంతో దేశంలో ప్రజాస్వామ్య పద్ధతులద్వారా సామ్యవాదాన్ని నెలకొల్పుకుంటాం".

# పాకిస్తాన్‌లో నెవిన్ పర్యటన

## సరిహద్దు ఒప్పందంపై సోమవారంనాడు సంతకాలు

రావల్పిండి, మే 7 : బర్మాదేశ అధినేత జనరల్ నెవిన్, విదేశాంగ మంత్రి ఉథీ నేడు రంగూన్ నుంచి యిక్కడకు వచ్చారు. వీరు తూర్పు, పశ్చిమ పాకిస్తానులలో నాలుగు రోజులపాటు పర్యటిస్తారు.

వీరికి విమానాశ్రయంలో పాకిస్తాన్ అధ్యక్షుడు అయూబ్‌ఖాన్ స్వాగతం ఇచ్చారు.

తూర్పు పాకిస్తాన్, బర్మాల మధ్య సరిహద్దు ఒప్పందంపై సోమవారం నాడు ఉభయ దేశాల నాయకులు సంతకాలుచేస్తారు.

పరస్పరం ఆసక్తి గల విషయాలపై ఒకరి అభిప్రాయాలను ఒకరు తెలిసికొంటారని పాకిస్తాన్ అధికారులు చెప్పారు.

—:o:—

# నాల్గవ విద్యుచ్ఛక్తి సర్వే కమిటీ నియామకం

న్యూఢిల్లీ, మే 7 : 1966లో విద్యుచ్ఛక్తి లోడ్ సర్వే పర్యవేక్షించుటకు కేంద్ర ప్రభుత్వం ఎనిమిదిమంది సభ్యులతో నాల్గవ విద్యుచ్ఛక్తి సర్వే కమిటీని నియమించింది.

ఈ కమిటీకి, సెంట్రల్ ఎలెక్ట్రిసిటీ అథారిటీ అధ్యక్షుడు నాయకత్వం వహిస్తారు.

# రష్యాతో రాజీ అసాధ్యం

## చైనీస్ కమ్యూనిస్టుపార్టీ ప్రధాన కార్యదర్శి ప్రకటన

పెకింగ్, మే 7 : సిద్ధాంత విద్రోహులైన సోవియెట్ నాయకులతో ఎట్టి రాజీ సాధ్యంకాదని చైనీస్ కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి టెంగ్‌సియాయోపింగ్ ప్రకటించారు.

అల్బేనియా నాయకుల గౌరవార్థం జరిగిన సభలో నిన్న ప్రసంగిస్తూ, సోవియెట్ కమ్యూనిస్టు పార్టీ అగ్రనాయకత్వపు సిద్ధాంత విద్రోహపు దోషులను టెంగ్ ఖండించారు.

"వారి వల్ల ఏమాత్రం సౌకర్యం తగదు. సిద్ధాంత విద్రోహానికి వ్యతిరేకంగా పోరాటం సాగించాలి. మనం ఎన్నడూ దానితో రాజీ పడరాదు. దానిని నిర్మూలించేవరకు పోరాడాలి."

ప్రపంచాధిపత్యాసక్తి పరస్పరం సహకరించుకొంటున్న సోవియెట్ సిద్ధాంత విద్రోహులు, అమెరికన్ సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా సమైక్యంగా పోరాడుతామని అల్బేనియా, చైనా నాయకులు ప్రకటించారు.

ఈ బహిరంగసభ షాంఘై నగరంలో జరిగిందని నవచైనా వార్తాసంస్థ తెలుపుతున్నది.

సోవియెట్ కమ్యూనిస్టు నాయకులు మార్క్సిజానికి, లెనినిజానికి వ్యతిరేకంగా బద్ధశత్రువుల స్థితికి దిగజారిపోయారనీ, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమానికి ద్రోహం చేసినవారనీ, అన్ని దేశాల విప్లవోద్యమాల విధ్వంసకులనీ, అమెరికన్ సామ్రాజ్యవాదులతో రాజీపడినవారనీ పింగ్ అన్నారు.

—:o:—

# ఏలూరులో మోటారు సైకిలు ప్రమాదం

## ఇద్దరు పోలీసు కానిస్టేబుల్స్ మృతి

("ఆంధ్రపత్రిక" ప్రతినిధి)

హైదరాబాద్, మే 7 : నిన్న మధ్యాహ్నం ఏలూరులో మోటారు సైకిలుపై వెడుతూండగా ముందు టైరు పగిలిపోయిన ఫలితంగా దానిపై ప్రయాణం చేస్తున్న ఇద్దరు సాయుధ రిజర్వు పోలీసు కానిస్టేబుల్స్ ప్రాణాలు కోల్పోయారు.

పినిరువురా ట్రంకురోడ్డుమీద సూపరింటెండెంట్ బంగళానుంచి పోలీసు కార్యాలయంకి వెడుతూండగా ఈ దురదృష్ట సంఘటన జరిగింది. వెనుక సీటుపై కూర్చున్న రత్నరాజు అనే కానిస్టేబులు వెంటనే మరణించాడు. సైకిలు నడుపుతున్న జగన్నాథం అనే రెండో కానిస్టేబులు తర్వాత కొంతసేపటికి మృతి చెందాడు.

# గోఖలే శతజయంతి

## పార్లమెంట్ భవనంవద్ద విగ్రహం ఆవిష్కరణ

న్యూఢిల్లీ, మే 7 : గోపాలకృష్ణగోఖలే శతజయంత్యుత్సవాలు ఎల్లుండి ప్రారంభం అవుతున్నాయి. వీటికి రేపురాత్రి రాష్ట్రపతి రాధాకృష్ణన్ రేడియో ప్రసంగంద్వారా ప్రారంభోత్సవం జరుపుతారు.

గోఖలే జన్మదినమైన 9వ తేదీని భారత ప్రభుత్వం సెలవుదినంగా ప్రకటించింది.

పార్లమెంటు భవనము సెంట్రల్ హాల్ ఎదుట గోఖలే విగ్రహాన్ని(బస్ట్‌ను)లోక్‌సభా సభాపతి ఆవిష్కరిస్తారు. ఈ విగ్రహాన్ని ప్రముఖ మహారాష్ట్ర శిల్పి శ్రీ జి.కె. మాత్రే చలువ రాతితో చేశారు.

ఆవిష్కరణానంతరం అన్ని పక్షాల పార్లమెంటు సభ్యులు సమావేశమై, శ్రీ గోఖలేకు జోహార్లు అర్పిస్తారు.

# విద్యుచ్ఛక్తి కార్మికుని దుర్మరణం

విజయవాడ, మే 7 : ఇక్కడకు సమీపమున గల ఎనికేపాడు (కృష్ణాజిల్లా) గ్రామంలో విద్యుచ్ఛక్తి శాఖలో పని చేస్తున్న వైర్‌మెన్ శ్రీ ముదునూరి సుబ్బరాజు పని చేస్తుండగా నేడు ప్రమాదవశాత్తు మరణించాడని ఆంధ్రరాష్ట్ర విద్యుచ్ఛక్తి కార్మికుల సంఘం కార్యదర్శి తెలియ చేశారు.

శ్రీ సుబ్బరాజుకు భార్యా పిల్లలు ఎవరూ ఇక్కడ లేనందున యితని మరణం గురించి తెలియ చేయులేక పోయామనీ, అయితే ఆయన అమలాపురం తాలూకాలోని ముమ్మిడివరం, పల్లెపాలెం, చినపెదలంక గ్రామాలకు చెందినవాడనీ కూడా సంఘ కార్యదర్శి తెలిపారు.

అంత్యక్రియలు జరుపకుండా భార్యా, పిల్లల కొరకు శవమును ఎనికేపాడులో ఉంచి నట్లు కూడ ఆయన పేర్కొన్నారు.

# బాండుంగ్‌సూత్రాలు ఆధారంగా అంతర్జాతీయ సంబంధాలు

## టిటో నాసర్‌ల సంయుక్త ప్రకటన

బీరూట్, మే 7 : ప్రపంచ శాంతి సాధనకు ఐకమత్యంగా ప్రయత్నాలు చేయవలసిందని యుగోస్లావియా అధ్యక్షులు శ్రీ టిటో, ఐక్య అరబ్ రిపబ్లిక్ అధ్యక్షులు శ్రీ నాసర్, ప్రపంచ దేశాలకు విజ్ఞప్తి చేశారు.

శ్రీ టిటో అరబ్ రిపబ్లిక్ సందర్శన ముగిసిన అనంతరం ఉభయ దేశాల నాయకులు విడుదల చేసిన సంయుక్త ప్రకటనలో అంతర్జాతీయ సంబంధాలలో బలప్రయోగం అవలంబించటం ఉభయ నాయకులు గర్హించారు. ఈ సంయుక్త ప్రకటనను కైరో రేడియో యీ రాత్రి ప్రసారం చేసింది.

అన్ని రాజ్యాలు తమ వనరులను అభివృద్ధి చేసుకోటానికి అనువైన వాతావరణం ప్రపంచ దేశాలు కలిసి సృష్టించాలని, ఈ సంయుక్త ప్రకటన పేర్కొన్నది.

అంతర్జాతీయ సంబంధాలకు బాండుంగ్ బెల్గ్రేడ్, కైరోలలో విబంధ దేశాల మహాసభలు ప్రకటించిన సూత్రాలు తగినవని వాటికి తమ మద్దతును పునః సృష్టీకరించారు.

శాంతియుత సహజీవనం, సమానసర్వంసహాధికారం, అంతరంగిక విషయాలలో జోక్యం కల్పించుకోక పోవటం, ఆర్థిక సామాజిక విధానాలపై పరస్పర గౌరవం, యీ సూత్రాల ప్రాతిపదికపై అంతర్జాతీయ సహకారం పెంపొందించుకోవలసిన ఆవశ్యకతను, అంతర్జాతీయ వివాదాలను శాంతియుత పద్ధతుల ద్వారా పరిష్కరించుకోటం గురించి యీ ప్రకటనలో నొక్కి చెప్పటం జరిగింది.

# విజయవాడలో టెలిఫోన్ కాల్స్‌లో ఆలస్యం కారణాలు

(స్వకీయ విలేఖరి)

బందరు, మే 7: "విజయవాడలో 2700 టెలిఫోనులున్నాయి, 179 ఆపరేటర్లు ఉన్నా, ఆపరేటర్లు లైనులో ఉన్నప్పుడు ఉపయోగించే హెడ్ ఆపరేటర్లు సరిగా పని చేసేవి 45కు మించి లేవు. అసలు వైర్లు కత్తిరించేందుకు శక్తివంతమైన కటింగ్ ప్లేర్లు, ఇన్సులేషన్ టేపు లాంటివి కూడా సరఫరా కావటంలేదు. దీని వలన టెలిఫోను కాల్సుకు విపరీతమైన కాలవిలంబన, కొన్ని సందర్భాలలో "రింగు" చేసినప్పటికీ అవతలి పోను "రింగు" కాని సంఘటనలు అనేకం జరుగుతున్నాయి" అని అఖిల భారత టెలిగ్రాఫ్ యింజనీరింగ్ ఎంప్లాయీస్ యూనియన్ సర్కిల్ సెక్రటరీ శ్రీ సి. సూర్యనారాయణ చెప్పారు.

నేటి ఉదయం కృష్ణాజిల్లా వాణిజ్య మండలి ఏర్పాటు చేసిన సభకు డా. ఎ. ఎస్. రావు అధ్యక్షత వహించారు. ఈ సభలో శ్రీ సూర్యనారాయణ ప్రసంగిస్తూ ఇలా చెప్పారు : "ఈ లోపాలు లేకుండా ఉండాలంటే ఈ పరికరాలు ఉత్పత్తి చేసే పరిశ్రమను విస్తరింపజేసే అధికోత్పత్తి జరిపించాలి. ఈ విషయంలో యూనియన్ లోగడ తీర్మానం చేయటం కూడా జరిగింది. డివిజనల్ ఇంజనీరు ఈ విషయం అంగీకరించటం, ఈ లోపాలను ప్రత్యక్షంగా ఒక ఉన్నతాధికారికి చూపటం కూడా జరిగింది. అయితే అధికారుల మధ్య సమన్వయం లేకపోవటం, ఒకరు లోపాలు అంగీకరిస్తే, మరొకరు లోపాలకు కారకులు సిబ్బందే అని అనటం జరుగుతున్నది. ఇది సత్యదూరం. ప్రజలకు సేవచేయాలన్న సిబ్బంది ఆశయం. అందుచేత యదార్థ విషయాలు పత్రిక సంఘాలు సభల్లో నివేదిస్తున్నాము. సిబ్బందికి నాలుగుపేండ్ల సర్వీసు ఉంటే ప్రమోషను యివ్వాలి. అయితే ఆంధ్రకు ప్రత్యేక సర్కిల్ లేనందువ 15 ఏండ్ల సర్వీసు ఉన్నా ప్రమోషన్లు లేవు. ఆంధ్రకు ప్రత్యేకంగా సర్కిల్ కార్యాలయం అవసరం. ఇది జరిగిన నాడు, ప్రజలకు— ఈ శాఖ సిబ్బందికి చిక్కులు తొలగి పోతాయి. అన్ని రాష్ట్రాలకంటే ఈ శాఖ రివిన్యూ ఆంధ్రలో అధికంగా వస్తున్నా, ఆంధ్రులు ఈ శాఖ వలన బాధలు ఎక్కువగా పడుతున్నారు"

'నిధులున్నా, నిధుల విడుదలకు ఎన్నిసార్లు ఆర్థికశాఖను అర్థించినా అత్యంత ఆర్థిక పరిస్థితి కారణంగా విడుదల కాక పోవటంతో ఆంధ్రలో ఆటోమేటిక్ ఎక్స్ఛేంజిలు ఏర్పాటు కాలేదు— రైల్వే శాఖకు ఈలాంటి ఆటంకాలు లేవని గుర్తించండి.''

పి. అండ్. టి.బోర్డుకు విస్తృతాధికారాలు యిచ్చి, ఆర్థిక శాఖవారి చిక్కులు లేకుండా చూచినప్పుడే ఈ శాఖలో అభివృద్ధి జరుగుతుంది.''

ఈ నెల 20 నుండి 26 వరకు తమ సిబ్బంది తమ కోర్కెల సాధనకు జరిపే సహాయ నిరాకరణ ఉద్యమానికి మీసంపూర్ణ సహాయాలు యిచ్చి సానుభూతి చూపాలని కోరుతున్నాను.''

పోను కాల్సుకు జరిగే కాల విలంబనకు కారకులు ఆర్థికశాఖ కల్గించే చిక్కులే గాని, సిబ్బంది ఎంతమాత్రంకాదు.'' మా కోర్కెల్లో ప్రధానమైనవి పనిభారం నిర్ణీత ప్రకారం మించి ఉండరాదన్నదే. ఈ ఉద్యమం శాంతియుతంగా జరుగుతుంది.''

—:o:—

# ఈజిప్టులో కోసిగిన్ పర్యటన

మాస్కో, మే 7: సోవియట్ ప్రధాని కోసిగిన్ వచ్చే మంగళవారం కైరో వెళుతున్నారు. పశ్చిమాసియాలో ఆవిర్భవిస్తున్న అభ్యుదయ రాజకీయ శక్తులతో సంబంధాలను దృఢతరం చేసికొనడం పట్ల క్రెమ్లిన్ ఆసక్తిని తెలియజేస్తూ, ఈయన నాసర్‌తో చర్చలు జరుపుతారు.

1964 అక్టోబరులో ప్రధాని అయిన తర్వాత ఆయన వెళ్లే మొదటి కమ్యూనిస్టేతర దేశం యిదే. ఈయన వెంట రాజకీయ, ఆర్థిక నిపుణులు కూడా వెడతారు.

# మిజోలచే కాల్పులు

## ముగ్గురి ప్రమాద స్థితి

షిల్లాంగ్, మే 7 : మిజోకొండలజిల్లా ప్రధాన కేంద్రమైన ఐజాల్‌కు సుమారు 16 మైళ్ల దూరంలో సర్కార్‌వద్ద రక్షక దళంపై మిజో విద్రోహులు నిన్న కాల్పులు జరిపిన ఫలితంగా అయిదుగురు గాయపడినారని, ముగ్గురు పరిస్థితి ప్రమాదకరంగా ఉందని ఇక్కడకు అధికారపూర్వక సమాచారం అందినది.

ఈ కాల్పులలో మిజో విద్రోహులు ఆటోమేటిక్ ఆయుధాలను ఉపయోగించారు. అవతలలో దాంకుగి సిర్చాక్ —ఐజల్ రోడ్డుకు ఇరుపక్కల నుంచి విద్రోహులు కాల్పులు జరిపారు.

ఇందువల్ల రెండు జీపులు బాగా దెబ్బతిన్నాయి. నాలుగు లారీలు కొద్దిగా పాడయ్యాయి.

భద్రతాదళాలు తిరిగి కాల్పులను జరపడంతో, విద్రోహులు పారిపోయారు.

గాయపడ్డవారిని చికిత్స నిమిత్తము ఐజల్‌కు తీసుకువెళ్లారు.

మిజోకొండజిల్లాలో భద్రతాదళాలు కాపలా ఎక్కువచేశాయనీ, విద్రోహులను ఆచూకీ తీయడంలో స్థానిక ప్రజలు భద్రతాదళాలకు సహాయపడుతున్నారనీ ఇక్కడికి అందిన సమాచారంలో పేర్కొన్నారు.

### కల్లోల ప్రాంతంగా ప్రకటన

బర్మా సరిహద్దుకు ఆనుకొని ఉన్న ఆరాచంద్‌పూర్, జిరిబాం సబ్‌డివిజన్‌లను కల్లోల ప్రాంతంగా ప్రకటించిన ఉత్తర్వు వ్యవధిని మరో నెల పొడిగిస్తూ మణిపూర్ చీఫ్ కమిషనర్ శ్రీ బాలేశ్వరప్రసాద్ ఉత్తర్వు జారీ చేశారు.

# దుర్భిక్షానికి గురైన రాష్ట్రాలకు అప్పులు

## —రాజ్యసభలో ప్రశ్నలు

న్యూఢిల్లీ, మే 7 :

కేంద్రం క్షామపీడిత ప్రాంతాలకు మరింత సహాయం అంద జేయాలని నేడు రాజ్యసభలో ప్రభుత్వానికి ఆయా క్షామపీడిత ప్రాంతాల సభ్యులు విజ్ఞప్తి చేశారు.

ఆర్థికశాఖ సహాయమంత్రి శ్రీ బి. ఆర్. భగత్ నేడు రాజ్యసభలో క్షామ పీడితప్రాంతాలైన ఆరు రాష్ట్రాలకు అప్పుల రూపేణా 12 కోట్ల 80 లక్షల రూపాయలు ఇవ్వబడినట్లు చెప్పగానే సభ్యులు పై విజ్ఞప్తిచేశారు.

ప్రభుత్వ ఋణాలు ఈ విధంగా వున్నాయి. మధ్య ప్రదేశ్, మైసూర్, రాజస్థాన్‌లకు మూడేసి కోట్లు రూపాయలు, మహారాష్ట్రకు రెండుకోట్లు, ఒరిస్సాకు 1 కోటి 45 లక్షలు' జమ్మూ—కాశ్మీర్‌లకు 35 లక్షల రూపాయలు, గుజరాత్ పశ్చిమ, బెంగాల్ ప్రభుత్వాలు, కేంద్రాన్ని అప్పులు అడగలేదని శ్రీ భగత్ జవాబు చెప్పారు.

మైసూర్ అడిగినంత అప్పు ఇవ్వలేకపోడానికి కారణాలు వివరిస్తూ మంత్రి ఈ అప్పుల మంజూరు ఆయా ప్రాంతాలకు పరిశీలనార్థం పంపబడిన నిపుణుల బృందాల సిఫార్సుల ఆధారంగా చేశామని చెప్పారు.

ఒక వేళ మిగిలిన పరిశీలనానంతరం ఒరిస్సాకు మరింత సహాయం అవసరం అనుకుంటే దాన్ని పరిశీలించడం జరుగుతుందని, శ్రీ భగత్ చెప్పారు.

సహకార సంస్థలు ఇచ్చిన స్వల్పకాలిక ఋణాలను, మధ్యకాలిక ఋణాలుగా మార్చు చేయమని, కేంద్రం సలహాఇస్తుందా ? అన్న ప్రశ్నకు కేంద్ర సహకార సంస్థలు ఈవిషయమై ఆలోచించుకుని కేంద్రానికి తెలియచేస్తే ఆ విషయం పరిశీలించబడుతుంది అని మంత్రి చెప్పారు.

—:o:—

## భారత్ అమెరికన్ సంస్థ రద్దుకై తీర్మానం

### లోక్‌సభలో కమ్యూనిస్టు నాయకుని ప్రతిపాదన

న్యూఢిల్లీ, మే 6 : భారత్—అమెరికా సంస్థ ఏర్పాటును తిరస్కరించాలని లోక్‌సభలో ప్రవేశపెట్టిన అనధికార తీర్మానంపై నేడు చర్చ ప్రారంభమైంది.

ఈ సంస్థ ఏర్పాటును అంగీకరించవద్దని కోరుతున్న తీర్మానాన్ని మితవాద కమ్యూనిస్టు వర్గం నాయకుడు శ్రీ హెచ్.ఎన్. ముఖర్జీ ప్రతిపాదించారు.

ఈ ప్రతిపాదనవల్ల దేశంలో ఇప్పటికే భిన్న అభిప్రాయాలు వ్యక్తమైనాయి. భారత దేశపు కంఠాన్ని నొక్కివేసేందుకు అమెరికా నుండి దిగుమతిచేసుకుంటున్న బంగారపు గొలుసువంటిది ఈ సంస్థ అని శ్రీ ముఖర్జీ అన్నారు.

ఒక్క అమెరికాకే ఇది వర్తిస్తుందా అని ఒక సభ్యుడు అడిగారు.

బంగారు గొలుసులు ఏ దేశంనుండి తెప్పించుకోవడాన్ని తాము సమర్థించబోమని శ్రీ ముఖర్జీ అన్నారు. ఇటువంటి సంస్థ ఏర్పాటుచేసితీరాలనేలిరుగులేనినిబంధనవిదీలేదు. మనకు ఇష్టమైతే దీనిని వదులుకోవచ్చునని శ్రీ ముఖర్జీ అన్నారు. శ్రీ ముఖర్జీ తమ ప్రసంగం ముగించకముందే సభవారు మరో అంశం తీసుకున్నారు.

ఈ తీర్మానంపై చర్చ వచ్చే సమావేశములో జరుగుతుంది.

### భారత్ అమెరికన్ విద్యాసంస్థ ఏర్పాటు

భారత్ అమెరికన్ విద్యాసంస్థ ఏర్పాటు విషయమై ఇప్పుడు చొరవ తీసుకోవలసింది భారతప్రభుత్వమేనని అమెరికానుండి వస్తున్న వార్తలు సూచిస్తున్నవి.

సంస్థకు ఈ సంవత్సరమే ఏర్పాటుచేయు దల్చుకుంటే మే 15వ తేదీనాటికే అమెరికన్ నిపుణులను భారతప్రభుత్వం ఆహ్వానించాలని ఈ వార్తలు తెలుపుతున్నాయి.

న్యూఢిల్లీకి ఇబ్బంది కలిగించే చర్య ఏదీ వాషింగ్టన్ తీసుకోనబోదనికూడా తెలుస్తున్నది.

## భారత్‌పై ప్రపంచ బ్యాంకు పెత్తనం

### లోక్‌సభలో గోపాలన్ హెచ్చరిక

న్యూఢిల్లీ, మే 6 : విదేశ సహాయంపై మితిమీరి ఆధారపడటం ప్రమాదకరమని హెచ్చరిక చేస్తూ, విదేశీ ఒత్తిడికి, బెదిరింపులకు తలఒగ్గవలదని అతివాద కమ్యూనిస్టు నాయకుడు శ్రీ ఏ. కె. గోపాలన్ నిన్న లోక్‌సభలో ప్రభుత్వాన్ని కోరారు.

16 నెలలపాటు డిఫెన్స్ అనంతరం విడుదలైన నిన్న తొలిసారిగా లోక్‌సభ సమావేశానికి హాజరైన శ్రీ గోపాలన్ ఆర్థిక విధానంపై చర్చలో పాల్గొంటూ యింకా ఇలా అన్నారు:— భారత ఆర్థిక వ్యవహారాలపై నిర్ణయాలు ఇప్పుడువాషింగ్టన్, న్యూయార్క్, ప్రపంచ బ్యాంకులలో జరుగుతున్నాయి ఈ విధంగా కొనసాగితే ప్రణాళికా విధానం మంటూ ఇక మిగిలేది ఏమిటి ? మన ఆర్థికీయ స్వాతంత్ర్యానికే ప్రమాదం ఏర్పడుతుంది.

ప్రభుత్వపు దివాలా కోరు విధానాలు దేశం సర్వనాశనానికి దారి తీశాయి. పరోక్షపు పన్నులు క్రమంగా పెరిగిపోయాయి. గత 15 సంవత్సరాలలో అభివృద్ధి కార్య కలాపాలకు చెందని ఖర్చు 37 శాతం పెరిగింది. విదేశీ ఋణాలపై ఆధారపడటం నానాటికీ పెరుగుతున్నది. ప్రపంచ బ్యాంకు అమెరికా ప్రభుత్వం నిర్ణయం గైకొనే వరకూ పార్లమెంటు సైతం నాలుగవ ప్రణాళికపై చర్చించటానికి వీలు పడనంతగా విదేశీ ఋణాలు పెరిగాయి.

ఈ సరళి కొనసాగితే మన ప్రణాళికా సంఘం ప్రపంచ బ్యాంకుకు అనుబంధ సంస్థగా తయారవుతుంది. ఇది చాలా దిగజారి పోవటమే.

అందుచేత, ప్రపంచ బ్యాంకు బెదరింపులకు పూనుకొంటున్న దన్నా, అమెరికన్ గుత్త వ్యాపారస్థులు ఇతోధికంగా సదుపాయాలు కోరుతున్నారన్నా ఆశ్చర్యంలేదు. వర్ధమాన దేశాలలో వారు అవలంబిస్తున్న ఈ దారుణ విధానాన్ని ప్రతిఘటించ వలసి ఉన్నది.

ఈ ఒత్తిడికి, బెదరింపులకు భారత ప్రభుత్వం తలఒగ్గటం ఆశ్చర్యం కలిగిస్తున్నది. ఈ ప్రభుత్వం జాతీయ గౌరవ మర్యాదలను పూర్తిగా కోల్పోయింది. ప్రపంచ బ్యాంకు యిలా మొరటుగా పెత్తనం చేయటంలోని ప్రమాదాన్ని ప్రభుత్వం గుర్తించ లేదు.

పి. యల్. 480 ఋణాలపై ఇంత దీనంగా ఆధారపడి ఉండటం దేశంలో విషమ పరిస్థితిని కల్పించింది.

మేలైన సాగుబడి పద్ధతులను ప్రవేశపెట్టడానికి మారుగా నానాటికి అధికంగా ఆహార ధాన్యాలు దిగుమతులు చేసుకోవటం జరుగుతున్నది. ఆహార సమస్య పరిష్కారానికి సర్వ విధాలా కృషి చేయగలమని నా అరెస్టుకు పూర్వం సభలో ప్రభుత్వం హామీ ఇచ్చింది. అయితే పరిస్థితి ఏ విధంగాను మెరుగు పడలేదు. క్షుద్బాధ వల్ల ఒరిస్సాలో ప్రజలు మరణిస్తున్నారు. ఇంతటి దారుణమైన తప్పులు చేసికూడా ఆహారమంత్రి గుణపాఠం నేర్చుకోలేదు.

అమెరికా ఆహార శాఖ కార్యదర్శి ప్రవేటనలనే మన ఆహార మంత్రి వల్లిస్తున్నారు. "పి. యల్. 480 మంత్రి" అని ఆయన చెప్పుకొంటే సమంజసంగా ఉంటుంది. దేశంలో ఆహారం కొరతను అంచనా వేయటంలో సైతం ఆయనకు అమెరికాతోడ్పాటు కావలసి వచ్చింది.

భారత్ అమెరికా సమిష్టి విద్యానిధి ఆనేది పి. యల్. 480 నుంచి ఆవిర్భవించినదే. మన డబ్బుతో మన దేశంలో విస్తృత విద్యా రంగంపై అమెరికా పెత్తనం చేయుటానికి అది వీలు కల్పిస్తుంది. అమెరికా గూఢచారి సంస్థ నిరాఘాటంగా తమ కార్య కలాపాలు సాగించటానికి, ధనం ఆశ చూపి మన దేశంలోని వారిని లోబరుచుకోవటానికి ఇది అస్కారం కల్పిస్తుంది. కొత్త తరహా విధానంతో కూడుకొన్న ఈ పథకానికి ప్రధాన మంత్రి ఆమోదం తెలుపటమే సిగ్గుచేటు. "వాయిస్ ఆఫ్ అమెరికా" ఒప్పందం తర్వాత ఇదే అత్యంత అవమానకరమైన ఒప్పందం.

# పాక్ స్వాధీనమైన దిగుమతి సరుకులు

### నష్టపడిన పరిశ్రమలకు మారక ద్రవ్యం కేటాయింపు

న్యూఢిల్లీ, మే 5: ముడి పదార్థాల దిగుమతులను పాకిస్తాన్ స్వాధీనపరుచుకొన్న ఫలితంగా కొరతకు గురి అయి నష్టపడిన పరిశ్రమలకు అట్టి ముడి పదార్థాలను పొందే నిమిత్తం తాత్కాలిక ప్రాతిపదిక పై మారక ద్రవ్యానికి అనుమతి జారీ చేయగలమని రాజ్యసభలో నేడు వాణిజ్యశాఖ మంత్రి శ్రీ మనుభాయిషా ప్రకటించారు.

ఆయన ఇంకా యిలా తెలిపారు:

పాకిస్తాన్ స్వాధీనపరుచుకొన్న సరుకుల మొత్తం విలువ 10 కోట్ల రూపాయలు. అందులో 7.5 కోట్ల రూపాయలమేరకు భీమా చేయబడినవి.

తాష్కెంట్ ఒప్పందం అనంతరం ఆ సరుకుల విషయమై భారత్ పాకిస్తాన్ మధ్య చర్చలు జరుగుతున్నాయి. అందుచే అవి పూర్తిగా నష్టమైన సరుకుల క్రింద భావించటానికి వీలు లేదని భీమా సంస్థలు వాదిస్తున్నాయి. ఈ విషయంపై చర్చలు జరుగుతున్నాయి. భీమా చేయబడిన 7.5 కోట్ల రూపాయలలో 5 కోట్లు భారతీయ భీమా కంపెనీలు, మిగిలిన 2.5 కోట్లు విదేశీ కంపెనీలు పేరిట ఉన్నవి.

—:o:—

## కేంద్ర విశ్వవిద్యాలయాల ఆడిట్ నివేదికలు

### పార్లమెంటుకు సమర్పించక పోవడంపై విమర్శ

న్యూఢిల్లీ, మే 6 : కేంద్ర విశ్వవిద్యాలయాల పద్దులపై ఆడిట్ నివేదికలను పార్లమెంట్‌కు సమర్పించటంవల్ల ప్రభుత్వం తాత్సారం చేయడంపై లోక్‌సభ పబ్లిక్ ఎకౌంట్స్ సంఘం తమ ఆందోళనను వ్యక్తం చేసింది.

ఈ సంఘం నివేదికను నిన్న లోక్‌సభకు అందజేశారు.

ఈ విశ్వవిద్యాలయాలపై ఆడిట్ నివేదికలను పార్లమెంటుకు సమర్పించేటట్లు రాష్ట్రపతి చూడాలని ఆడిటర్ జనరల్ 15 ఏళ్ల క్రితమే సూచించారు. కాని ప్రభుత్వం ఈ విషయంలో ఏమీ చర్య తీసుకోలేదని పబ్లిక్ ఎకౌంట్స్ కమిటీ పేర్కొంది. ఈ నివేదికలను పార్లమెంటుకు సమర్పించడంవల్ల విద్యారంగంలో విశ్వవిద్యాలయాల స్వతంత్ర ప్రతిపత్తికి భంగం కలుగదనికూడా పేర్కొన్నారు.

ఈ నివేదికలను అందచేయడాన్ని గురించి పార్లమెంటులో మొదట 1951—52లో ప్రస్తావన వచ్చింది. అప్పటినుంచి ఇప్పటి వరకు ఈ సమస్య అప్పుడప్పుడు వస్తూనే ఉంది.

ప్రభుత్వం ప్రజా ఋణాలు చేయడంపై ఒక పరిమితిని నిర్ణయించే హక్కు రాజ్యాంగం 242వ అధికరణ ప్రకారము పార్లమెంటుకున్నదనీ, దీనిని కనీసం ఒకమారు ఆచరణలోపెట్టి చూడాలనీ అకౌంట్స్ సంఘం ఇదివరలోనే సిఫార్సుచేసింది.

# పశువుల కళ్ళకువచ్చే వ్యాధుల నిరోధానికై 40 రకాలమందులు

## భారత పరిశోధన సంస్థ ఉత్పత్తి

ఇజట్‌నగర్, మే 7 : పాడి పశువులకు, కోళ్లకు సోకే వ్యాధులను నిరోధించటానికై పలురకాల ఇంజక్షన్, టీకాలు మందులను భారత పశు పోషణ పరిశోధన సంస్థ కనిపెట్టింది. ప్రస్తుతం వీటిని భారీ మొత్తంలో యీ సంస్థ తయారు చేస్తున్నది.

పశువులు ధరలకు ప్రతి సంవత్సరము సరాసరి 21345373 డోసుల మందును యీ సంస్థ సరఫరా చేస్తున్నది.

కోళ్లకు సోకే రానికెట్ వ్యాధి నిరోధానికై డోసు మందు ఖరీదు అర పైసా కంటే కూడ తక్కువే. 200 డోసుల మందు ఖరీదు 62 పైసలు. కోళ్ల పరిశ్రమ యీ మందు వలన బాగా అభివృద్ధి చెందింది. బాతులకు సోకే జ్వర నిరోధక ఔషధం ఖరీదు రు. 3.33. ఇదే అన్నింటికంటే ఎక్కువ.

గుర్రాల వ్యాధి నిరోధానికై మందు కని పెట్టటమే భారత పరిశోధన సంస్థ సాధించిన ఘన విజయంలో ఒకటి. 1960లో యీ వ్యాధి విశేషంగా వ్యాపించి 28000 గుర్రాలను బలిగొన్నది.

పశువులలో క్షయ రోగం వ్యాపించటం ఆందోళన కలిగించే అంశం. దానిని నిరోధానికై యీ సంస్థ ఒక పథకం కూడ రూపొందించింది. ఈ పథకాన్ని ప్రణాళికా సంఘం కూడా ఆమోదించింది.

## లోక్‌సభలో సంజీవరెడ్డి గైరు హాజరు

### సభ్యుల నిరసన

న్యూఢిల్లీ, మే 7: 1965 నవంబర్ 22 వ తేదీన అప్పటి ఉక్కుగనుల శాఖా మంత్రి తెలిపిన సమాచారం విషయమై లోక్‌సభసభ్యుడు శ్రీ హెమామిదాజీఒకప్రకటన చేసే సమయంలో సభలో కేంద్రమంత్రి శ్రీ సంజీవరెడ్డి లేకుండా ఉండటం పై యిద్దరు కమ్యూనిస్టు సభ్యులు శ్రీమతి రేణుచక్రవర్తి, ప్రొఫెసర్ హిరేన్‌ముఖర్జీ నిన్న తీవ్ర ఆక్షేపణ తెలిపారు.

నవంబర్ 22 న శ్రీ హెమామిదాజీపట్ల శ్రీ సంజీవరెడ్డి చాల దురుసుగా ప్రవర్తించారని, యిప్పుడు ఆ విషయమై శ్రీ దాజీ ప్రసంగించేటప్పుడు శ్రీ సంజీవరెడ్డి సభలో ఉండాలని శ్రీమతి చక్రవర్తి అన్నారు. నవంబర్ 22 న అన్న మాటలకు శ్రీ సంజీవరెడ్డి సభ్యునికి క్షమాపణ చెప్పుకోవాలని కూడా ఆమె అన్నారు.

ఇరువురు సభ్యుల వాదనతో సభాపతి శ్రీ హుకుంసింగ్ ఏకీభవిస్తూ ఆమె విషయమై సభలో ఒక ప్రకటన జరుగుతున్న సమయంలో మంత్రి సభలో ఉండాలని పేర్కొన్నారు.

సభాపతి రూలింగ్‌తో తాము ఏకీభవిస్తున్నట్లు పార్లమెంటరీ వ్యవహారాలమంత్రి శ్రీ సత్యనారాయణసిన్హా అన్నారు. శ్రీ సంజీవరెడ్డి బుద్ధి పూర్వకంగా సభకు గైరుహాజరు కాలేదనీ, నవంబరు 22 తరువాత ఆయన మంత్రిత్వశాఖ మారింది కాబట్టి (ప్రస్తుతం శ్రీ రెడ్డి రవాణా నౌకా, యాత్రికుల శాఖకు మంత్రి) శ్రీ దాజీ ఉక్కుశాఖమంత్రి జవాబు చెబుతే సరిపోతుందని ఆయన భావించారని శ్రీ సిన్హా వివరించారు.

1964 లో ప్రచురితమైన ఒక గ్రంథం ఆధారంగా రాగి ఉత్పత్తి గురించి 1965 నవంబర్ 22న శ్రీ దాజీ ఒక ప్రకటన చేశారు. ఆ విషయమై అప్పుడు శ్రీ రెడ్డి ఒక ప్రకటన చేస్తూ శ్రీ దాజీ చెప్పిన దానిని ఖండించారు.

# "హిమాలయాల వంటి ధీరులు కావాలి"

## బదరీనాథ్‌లో రక్షణమంత్రి చవాన్ ప్రార్థన

బదరీనాథ్, మే 6: హిమాలయోత్తుంగ శిఖరాలను బోలు ధైర్యశాలురను మాకు ప్రసాదించమని బదరీనాథుని ప్రార్థించడమే తన ఏకైక కాంక్షయని యిక్కడ రక్షణమంత్రి శ్రీ చవాన్ అన్నారు.

"మన దేశాన్ని హిమాలయాలు కాపాడుతూనే ఉన్నాయి. నేడు హిమాలయాలను కాపాడుకోవాల్సిన ఆవశ్యకత ఏర్పడ్డది. ఈ బదరీనాథుని ఆలయం చాలా పవిత్రమైనది. దీనిని పరిరక్షించవల్సిన బాధ్యత మనపైనున్నది" రక్షణమంత్రి ఉద్ఘోషించారు:

ఆయన యింకా యిలా అన్నారు.

"మనం యీ దేవాలయానికి వచ్చి లోపలికి వస్తూ చెప్పులుబయట ఎలా వదలి వస్తామో అలాగే యీ పవిత్ర హిమాలయ ప్రాంతాలకు వచ్చినప్పుడు అన్ని సంకుచిత భావాలు ప్రాంతీయాభిమానాలు వదిలి వేయాలి. ఈ ప్రాంతాన్ని దేశ రక్షణకోసం అతిభద్రంగా కాపాడుకోవాలి."

1700 సం. ల క్రితం ఆదిశంకరులు యిక్కడకు వచ్చారు. ఈ దేవాలయాన్ని ఆయన స్థాపించారు.

—o:o—

## అసఫ్ ఆలీ సేవా నిరతి

### న్యూఢిల్లీ సభలో రాష్ట్రపతి ప్రశంస

న్యూఢిల్లీ, మే 7 : స్వర్గీయ ఆసిఫ్‌ఆలీ స్మారక గోష్ఠికి రాష్ట్రపతి డాక్టర్ రాధాకృష్ణన్ నేడిక్కడ ప్రారంభోత్సవంచేస్తూ ఆయన జాతికి చేసిన సేవలను జ్ఞాపకార్థించారు.

ఆయన జాతీయ సంక్షేమానికే కృషిచేసిన ప్రముఖ రాజకీయవేత్త అని రాష్ట్రపతి ప్రశంసించారు.

ఢిల్లీ విశ్వవిద్యాలయంలో ఆసిఫ్‌ఆలీ స్మారకార్థం ఎం.ఏ. ఉరుదు విద్యార్థులకు బహుమానాల వేతనాలు ఏర్పాటుచేస్తున్నందుకు ఆయన హర్షం తెలుపుతూ, ఇది ఉరుదు అధ్యయనాన్ని ప్రోత్సహించగలదని చెప్పారు.

ఆసిఫ్‌ఆలీకి జోహార్లర్పిస్తూ ఉపరాష్ట్రపతి డాక్టర్ జకీర్‌హుస్సేన్, ప్రధాని ఇందిరాగాంధి, కేంద్ర విద్యామంత్రి శ్రీ ఎం.సి. చాగ్లా సందేశాలు పంపారు.

—:o:—

## రాజ్యసభ బడ్జెట్ పరిశీలనా వివాదం

### లోక్‌సభలో తర్జనభర్జన

న్యూఢిల్లీ, మే 6 : రాజ్యసభ బడ్జెటు అంచనాలను ఎవరు పరిశీలించాలనే వివాదంపై నేడు మరొకసారి లోక్‌సభలో తర్జనభర్జన జరిగింది.

రాజ్యాంగ రీత్యా ఈ వివాదానికి ఒక పరిష్కారం కనుగొనాలని శ్రీయుతులు కామత్, హిరేన్ ముఖర్జీలతో సహా పలువురు ప్రతిపక్ష సభ్యులు కోరారు.

అనతికాలంగా రాజ్యసభ, లోకసభల మధ్య ఈ వివాదం వున్నది.

ఇదివరకు లోక్‌సభలో చెప్పిన దానిని ఇప్పుడు పెడదారిని పట్టించినందుకు కేంద్ర విద్యామంత్రిని శ్రీ కామత్, శ్రీ ముఖర్జీలు విమర్శించారు. రాజ్యసభ బడ్జెటును ఒక సంయుక్త ఉపసంఘం పరిశీలించాలని ఇదివరకు శ్రీ చాగ్లా సూచించారు.

తాము ఇదివరలో చెప్పినది సభ్యులకు ఆశాభంగం కలిగిస్తే క్షమించాలని సభలో వున్న శ్రీ చాగ్లా అన్నారు. రెండు సభల అధ్యక్షుల్లు సంప్రదింపులు జరుపుకొని ఒక అంగీకారానికి రావాలని శ్రీ చాగ్లా అన్నారు.

ఈ వివాదం ఇట్లాగే కొనసాగుతున్నందుకు సభాపతి శ్రీ హుకుంసింగ్ ఆందోళన వెలిబుచ్చుతూ సభ్యులు దీనిపై పట్టుబట్టరాదని అన్నారు.

ఈ వివాదంపై పరిష్కారం కుదిరితే సంతోషకరమే. అయితే రాజ్యాంగ నియమావళిని దృష్టిలో పెట్టుకోవాలి అని కూడ ఆయన అన్నారు. సభాపతి ఈ మాటలు అన్న వెంటనే అన్నివర్గాల సభ్యులు హర్షధ్వానాలు చేశారు.

వచ్చేవారం సభలో ప్రభుత్వం నిర్వహించే కార్యకలాపాలను గురించి సభా నాయకుడు శ్రీ సత్యనారాయణ సిన్హా ప్రకటించినప్పుడు, యీ వివాదాంశాన్ని శ్రీకామత్ ప్రస్తావించారు.

శ్రీ కామత్ ఇంకా ఏవో చెప్పబోతుండగా దానిపై ఇంకేమీ చెప్పవద్దని సభాపతి ఆయనను కోరారు. తాము రాజ్యసభ అధ్యక్షుడైన ఉపరాష్ట్రపతిని కలుసుకొని ఈ అంశం చర్చించామని సభాపతి అన్నారు.

సృష్టిలో పురుషుడు స్త్రీ వలెనే, రాజ్యాంగం ప్రకారం లోకసభకు రాజ్యసభకు ఎంతో తేడా వున్నది. రాజ్యాంగంలో 113 నిబంధన ప్రకారం ఆర్థిక పద్దులను చర్చించటానికి ఒక్క లోకసభకే హక్కు వున్నది. అని శ్రీ కామత్ అన్నారు.

రెండు సభల మధ్య సత్సంబంధాలు నెలకొనవలసిన ఆవసరం ఎంతో వున్నప్పటికి ఆర్థిక విషయాలలో లోకసభకు కొన్నిహక్కులు వున్నవని శ్రీ ముఖర్జీ చెప్పారు. ఈ వివాదం ఇట్లా కొనసాగుతూండగా పరిష్కారానికి ప్రభుత్వం ఎట్టి చర్యతీసుకోనకుండా వున్నందుకు ఆయన ఆగ్రహం వెలిబుచ్చారు.

సంయుక్త సోషలిస్టు పార్టీ సభ్యుడు శ్రీ మధులిమాయె ప్రసంగిస్తూ రాజ్యాంగంలోని 113 వ అధికారణను సరిగా పాటించకపోవటమే ఈ వివాదానికి కారణమని అన్నారు. అంచనాలను చర్చించే అధికారం, ఆమోదించే అధికారం రాజ్యసభకులేదని ఆయన పేర్కొన్నారు.

ఈ వివాదం విషయంలో రాజ్యసభను సంప్రదించగా ఏకగ్రీవంగా ఒక అభిప్రాయం వారు వ్యక్తం చేశారని కేంద్ర మంత్రి శ్రీ చాగ్లా అన్నారు. రెండు సభల మధ్య పరస్పర సామరస్య భావం వుండాలని, రాజ్యసభ గౌరవానికి ఎటువంటి భంగం కలుగరాదని, లోకసభతో సమానంగా రాజ్యసభను గౌరవించాలని రాజ్యసభలో సభ్యులందరు భావిస్తున్నారు అని కేంద్ర విద్యా మంత్రి అన్నారు.

రెండు సభలలోను ప్రభుత్వ పక్షానికే మెజారిటీ వుంది కాబట్టి ప్రభుత్వమే చొరవ తీసుకుని, రెండుసభల అధ్యక్షులతోను సంప్రదించి ఒక నిర్ణయం చేయాలని సభాపతి అన్నారు.

—o:o—

బెంగుళూరు, మే 6 : పందదార కంట్రోలు కొనసాగించాలా అక్కర్లేదా అన్న విషయంలో అభిప్రాయాన్ని తెలుప వలసిందిగా, కేంద్రం మైసూరు ప్రభుత్వాన్ని కోరింది. రాష్ట్ర ప్రభుత్వం యింతవరకు ఏ జవాబు చెప్పలేదు.

## చిక్కడపల్లిలో శ్రీ వేంకటేశ్వరస్వామి బ్రహ్మోత్సవాలు

హైదరాబాద్, మే 7 : హైదరాబాద్ నగరం చిక్కడపల్లిలో శ్రీ వేంకటేశ్వరస్వామి దేవాలయంలో శ్రీ వేంకటేశ్వరస్వామి బ్రహ్మోత్సవాలు ఈ నెల 5న ప్రారంభమయ్యాయి. 13వ తేదీవరకు ఈ ఉత్సవాలు జరుగుతాయి. ప్రతిదినము ఉదయం 8 గంటలనుండి 12 గంటలవరకు వేదపారాయణ, హోమాలబలి హారణాధులు, స్వామివారి సేవలు జరుగుతాయి. సాయంత్రం 6 గంటలనుండి భజనలు జరుగుతున్నవి.

శ్రీరామచంద్రమూర్తి బృందంవారు 7వ తేది 'సతీ సక్కుబాయి', 9వ తేది 'భక్త రామదాసు' నాటకాలు ప్రదర్శిస్తారు. 6 నుంచి శ్రీ లక్ష్మీనరసింహశర్మభాగవతార్ హరికథా కాలక్షేపాలు 10వ తేదీవరకు జరుగుతాయి.

# ఉద్యోగులు - ఉద్యోగాలు

("ఆంధ్రపత్రిక" ప్రతినిధి)

హైదరాబాద్, మే 8 ప్రభుత్వ పరిశ్రమల శాఖ సహాయ కార్యదర్శి శ్రీ డి. సుబ్బారావుకు 30 రోజులు సెలవు మంజూరు చేశారు.

పంచాయతీరాజ్య శాఖలో ప్రభుత్వ సహాయ కార్యదర్శి శ్రీ ముబాషిర్ అహమ్మద్‌ను బదిలీ చేసి శ్రీ బి. దేవదత్తం స్థానే, పరిశ్రమల శాఖలో ప్రభుత్వ కార్యదర్శిగా నియమించారు.

పరిశ్రమల శాఖలో ప్రభుత్వ సహాయ కార్యదర్శి శ్రీ బి. దేవదత్తంను బదిలీచేసి విద్యా శాఖలో ప్రభుత్వ సహాయ కార్యదర్శిగా శ్రీ పి. ఆర్. రాధాకృష్ణయ్య స్థానే నియమించారు.

విద్యాశాఖలో ప్రభుత్వ సహాయ కార్యదర్శి శ్రీ పి. ఆర్. రాధాకృష్ణయ్యను బదిలీచేసి ప్రభుత్వ పరిపాలనా శాఖ సహాయకార్యదర్శిగా శ్రీ వి. వి. మాణిక్యాలరావు స్థానే నియమించారు.

పరిపాలనా శాఖలో ప్రభుత్వ సహాయ కార్యదర్శి శ్రీ వి. వి. మాణిక్యాలరావును బదిలీ చేసి హోంశాఖలో, శ్రీ డి. సుబ్బారావు స్థానే సహాయ కార్యదర్శిగా నియమించారు.

మెదక్ ప్రత్యేక డిప్యూటీ కలెక్టరు శ్రీ కె. ఎస్. ఎ. అన్సారిని, శ్రీ కె. పురుషోత్తం నాయుడు స్థానే పౌర రక్షణ శిక్షణ సంస్థకు ప్రిన్సిపాల్, లెక్చరర్‌గా నియమించారు.

శ్రీ కె. పురుషోత్తం నాయుడును బదిలీ చేసి కరీంనగర్ సహకార నూలు మిల్లు మేనేజింగ్ డైరెక్టరుగా నియమించారు.

విద్యాశాఖలో ప్రభుత్వ సహాయ కార్యదర్శి శ్రీ బి. వెంకటయ్యకు 25—4—66తేదీ నుండి 16 రోజులు సెలవు మంజూరు చేశారు.

అనంతపూర్ పోలీసు సూపరింటెండెంటు శ్రీ ఎ. ఎస్. బాలరాజు మొదలియార్‌కు 9—5—66 నుండి 10 రోజులు సెలవు మంజూరు చేశారు.

ఖమ్మం జిల్లా పోలీసు సూపరింటెండెంటు శ్రీ జి. గురునాథరావుకు 3—5—66 తేదీనుండి 33 రోజులు సెలవు మంజూరు చేశారు.

సహకార సంఘాల అదనపు రిజిస్ట్రార్ శ్రీ వి. ఆదిశేషయ్యకు 4—5—66 తేదీ నుండి 30 రోజులు సెలవు మంజూరు చేశారు. శ్రీ ఆదిశేషయ్య సెలవులోవుండగా సహకార సంఘాల అదనపు రిజిస్ట్రార్‌గానూ, సహకార పంచదార ఫ్యాక్టరీలకు ప్రత్యేకాధికారిగా వున్న శ్రీ గిరిధర్ రాజు కొన్నానా ఐ.ఎ.ఎస్‌ను సహకార సంఘాల (సివిలియాగదారుల) అదనపు రిజిస్ట్రార్ విధులను పూర్తిగా నిర్వహించేందుకు నియమించారు.

రెవిన్యూ బోర్డు 5 వ సభ్యులు శ్రీ సయ్యద్ అమీనుర్ హుస్సేన్‌ను సెలవుపై వున్న శ్రీ సయ్యద్ అలీస్థానే 4 వ సభ్యులుగా వ్యవహరించేందుకు నియమించారు.

విద్యాశాఖలో ప్రభుత్వ ప్రత్యేక కార్యదర్శి శ్రీ ఎస్. భగవాన్‌దాసుకు రెవిన్యూ బోర్డులో సయ్యద్ శ్రీ అఫ్జర్ స్థానే 5 వ సభ్యులుగా నియమించారు.

భారత ప్రభుత్వ ఫుడ్ కార్పొరేషన్‌నుండి తిరిగి వచ్చిన శ్రీ ఎస్. ఆర్. ..... శ్రీ ఎస్. భగవాన్‌దాస్ స్థానే విద్యాశాఖ కార్యదర్శిగా నియమించారు.

చిత్తూరు జిల్లాలో శ్రీ డి. శ్రీనివాసుల నాయుడును మొదటి తరగతి మేజిస్ట్రేటుగా నియమించారు.

కరీంనగర్ జిల్లాలో శ్రీ డి. జె. శామ్యుల్‌ను మొదటి తరగతి మేజిస్ట్రేటుగా నియమించారు.

కర్నూలు జిల్లాలో శ్రీ డి. శ్రీనివాసుల నాయుడును రెండవ తరగతి మేజిస్ట్రేటుగా నియమించారు.

తూర్పు గోదావరి జిల్లాలో శ్రీ పి. ఎస్. వరప్రసాదరావును మొదటి తరగతి మేజిస్ట్రేటుగా నియమించారు.

కృష్ణా జిల్లాలో శ్రీ సి. హెచ్. వెంకటపతి రాజును మొదటి తరగతి మేజిస్ట్రేటుగా నియమించారు.

విశాఖ పట్టణంలో శ్రీ వై. వేణు గోపాల రెడ్డిని రెండవ తరగతి మేజిస్ట్రేటుగా నియమించారు.

కర్నూలు జిల్లాలో శ్రీ జి. రామారావును మొదటి తరగతి మేజిస్ట్రేటుగా నియమించారు.

శ్రీ షేక్ సాహెబ్ హుస్సేన్ డిప్యూటీ కలెక్టరుగా నియమింపబడి పశ్చిమ గోదావరి జిల్లాలో శిక్షణ పొందటానికి నియమించారు.

ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ సహాయ కార్యదర్శి శ్రీ ఎస్. కృష్ణారెడ్డికి 3—5—66 తేదీనుండి 29 రోజులు సెలవు మంజూరుచేశారు. శ్రీ కృష్ణారెడ్డి స్థానే 3—5—66 తేదీనుండి ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ సహాయ కార్యదర్శిగా శ్రీ బి. వెంకట్రామిరెడ్డిని నియమించారు.

బదిలీ అయిన శ్రీ జె. బాపురెడ్డి స్థానే నెల్లూరు రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు శ్రీ పి. రామకోటయ్యను బర్మానుండి వస్తున్న భారతీయులకు పునరావాస సౌకర్యాలు కలిగించే ప్రత్యేక అధికారిగా విశాఖ పట్టణంలో నియమించారు.

డిప్యూటీ కలెక్టరు పదవినుండి తాహసీల్దారుగా రివర్టు అయిన శ్రీ కె. సుబ్రహ్మణ్యేశ్వరరావును డిప్యూటీ కలెక్టరుగా మరల ప్రమోటుచేసి శ్రీ కె. పాపారావు స్థానే కందుకూర్‌కు రెవిన్యూ డివిజనల్ ఆఫీసరుగా నియమించారు.

ఫ్యాక్టరీల ఇన్‌స్పెక్టరుగా నియమితులైన శ్రీ కె. వెంకటేశ్వర్లును అనంతపురంలో ఫ్యాక్టరీల ఇన్‌స్పెక్టరుగా నియమించారు.

నాంపల్లి, హైదరాబాద్‌లో బాలికల బహుళార్థ సాధక ఉన్నత పాఠశాలలో గణితశాస్త్ర అసిస్టెంట్ శ్రీ ఎం. కాలా ఎలియాస్‌ను బదిలీచేసి కాచిగూడ, హైదరాబాద్‌లో బాలుర హైస్కూలుకు ప్రధానోపాధ్యాయులుగా శ్రీమతి షంసున్నిసా బేగం స్థానే నియమించారు.

హైదరాబాద్ ఆరోగ్య విద్యా బ్యూరో సాంకేతిక అధికారి శ్రీ ఎ. డి. హెచ్‌నాథ్‌కు 3—5—66 తేదీనుండి సెలవు మంజూరు చేశారు.

అటవీశాఖ డిప్యూటీ కన్సర్వేటరు, పోలవ ప్రాంతీయ అటవీ శాఖాధికారి శ్రీ కె. సుబ్బారావుకు పింఛను పుచ్చుకోటానికి వీలుగా 16—5—66 నుండి 30—6—66 తేదీవరకు సెలవు మంజూరు చేశారు.

సహకార సంఘాల రిజిస్ట్రార్ కార్యాలయంలో సహకార మార్కెటింగు సొసైటీలు బియ్యపు సేకరణ పని నిమిత్తం ఆర్థిక శాఖలో సెక్షన్ అధికారి శ్రీ జె. ఆర్. గోవిందరెడ్డిని తాత్కాలికంగా అదనపు అకౌంట్సు అధికారిగా నియమించారు.

కరీంనగర్ జిల్లా వెటరినరీ అధికారి శ్రీ అక్బర్ అలీఖాన్‌కు 1 నెల రోజులు సెలవు మంజూరు చేశారు.

విశాఖపట్టణం వ్యవసాయ శాఖ డిప్యూటీ డైరెక్టరు శ్రీ జి. కామేశ్వరరావుకు 29 రోజులు సెలవు మంజూరు చేశారు.

పబ్లిక్‌వర్క్స్ శాఖలో ప్రభుత్వ సంయుక్త కార్యదర్శిగా శ్రీ ఎస్. కె. సేత్‌ను నియమించారు.

పరిపాలనా శాఖలో ప్రభుత్వ సంయుక్త కార్యదర్శిగా శ్రీ శ్రావన్ కుమార్‌ను నియమించారు.

పంచాయతీరాజ్యశాఖలో ప్రభుత్వ సంయుక్త కార్యదర్శిగా శ్రీ హబీబ్ అలీఖాన్‌ను నియమించారు.

జిల్లా గణాంకశాఖ అధికారి శ్రీ జె. ఎల్. శూలపాణి సేవలు హైదరాబాద్‌లోని పట్టణ ప్రాంతీయదళ అధికారిగా నియమించటంకోసం టవును ప్లానింగు శాఖకు బదిలీ చేయబడ్డాయి.

శ్రీ ఎం. ఎ. రషీద్‌ఖాన్‌ను, శ్రీ ఎం. నారాయణ స్థానే వరంగల్ జిల్లాలో లాండ్ అక్విజిషన్ (రైల్వేస్) ప్రత్యేక డిప్యూటీ కలెక్టరుగా నియమించారు.

శ్రీ ఎం. నారాయణను హైదరాబాద్‌లో భూమి సేకరణ ప్రత్యేక డిప్యూటీ కలెక్టరుగా నియమించారు.

# ** దినఫలం **

మూతన వ్యవహారాలకు : మే 9 సోమవారం తిథి మంచిది. నక్షత్రం మంచిదికాదు. 10 మంగళవారం తిథి మంచిదికాదు. నక్షత్రం మంచిది.

ప్రయాణాలకు : మే 9 సోమవారం తిథి మంచిది. నక్షత్రం మంచిదికాదు. ఉత్పాతయోగం మంచిదికాదు) 10 మంగళవారం తిథి మంచిదికాదు, నక్షత్రం సామాన్యం. (ప్రానయోగం మంచిది)

(వర్జ్యమును, దుర్ముహూర్తమును గమనించవలెను.)

జన్మదినఫలం : మే 9 : గ్రహబలం అనుకూలంగా ఉంది. ఇప్పుడు మీరు జరిపే వ్యవహారాల వలన కేవలం తాత్కాలికమైన లాభమే కాకుండా, ముందుముందు కూడా తగిన ఉపయోగం ఉంటుంది. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలకంటే, మీరు స్వంతంగా చేసే వ్యాపారాలు లాభదాయకంగా ఉంటాయి. వృత్తి రీత్యా దూర ప్రయాణాలు చేసి కార్యసాధన చేయగలరు. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా తరచుగా లాభిస్తాయి. ఉద్యోగంలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. ఆరోగ్యం బాగా ఉంటుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు. విద్యార్థులు సామాన్యంగా కృతార్థులు కాగలరు.

## 9-5-1966 సోమవారం

శకసం. 1888 వైశాఖ మాసం 19

### మేషం

వ్యాపారంలో కొంత మంది మిత్రుల వ్యవహారాల్లో జోక్యం చేసికోవలసి వస్తుంది. ఆదాయంతో నిమిత్తం లేకుండా సమయానికి ఏదో ఒకవిధంగా డబ్బుచేతికి వస్తుంది. ఉద్యోగంలో అనుకూల వార్తలను వింటారు. భరణి నక్షత్ర జాతకులకు మాత్రం అనుకూలంగా ఉండదు.

### వృషభం

ముఖ్యమైన వ్యవహారాలు భాగస్వాముల నిర్ణయానికి వదలి వేయడం మంచిది. ప్రయాణాల్లో ప్రయాస అధికంగా ఉంటుంది. స్వల్ప అనారోగ్యం చేయువచ్చును. మృగశిరా నక్షత్ర జాతకులు మిగిలిన వారికంటే జాగ్రత్తగా వ్యవహరించడం అవసరం.

### మిథునం

ఏ వ్యవహారంలోను ఆరంభంలో కనుపించిన అనుకూలత ఆఖరు వరకు నిలుచు. భారీ ఎత్తున చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. కుటుంబ సంతోషం లభిస్తుంది. ఆర్ద్రా నక్షత్ర జాతకులకు మిగిలిన వారికంటె బాగా ఉంటుంది.

### కర్కాటకం

మీ స్వంత పనుల మాట ఎలాగ ఉన్నా, యితరుల నిమిత్తం చేసే ప్రయత్నాలు సులువుగా నెరవేరతాయి. అధిక వ్యయం జరుగుతుంది. సంతానానికి అనారోగ్యం చేయవచ్చును. ఆశ్లేషా నక్షత్ర జాతకులు జాగ్రత్తగా వ్యవహరించడం అవసరం.

### సింహం

అధికారుల వలన జరగవలసిన వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. ఉద్యోగంలో మీ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. విద్య వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. పుబ్బ నక్షత్ర జాతకులకు మాత్రం బాగా ఉండదు.

### కన్య

సామాన్యమైన వ్యవహారాలకు కూడా విశేషమైన కృషి చేయవలసి వస్తుంది. ఉద్యోగంలో సామాంచితమైన మీకు యిబ్బందివి కలిగిస్తుంది. పుణ్య కార్యాలు చేస్తారు. చిత్తా నక్షత్ర జాతకులు జాగ్రత్తగా వ్యవహరించడం చాలా అవసరం.

### తుల

భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాల కంటె మీరు స్వంతంగా చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు. శుభ కార్యాల విషయంలో మీ ప్రయత్నాలు శ్రమ మీద ఫలిస్తాయి. స్వాతీ నక్షత్ర జాతకులకు మిగిలిన వారికంటె బాగా ఉంటుంది.

### వృశ్చికం

రావలసిన డబ్బు సమయానికి అందడం వలన అన్ని వ్యవహారాలు అనుకొన్నట్లుగా నెరవేరతాయి. దూర ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది. కుటుంబ సంతోషం లభిస్తుంది. అనూరాధా నక్షత్ర జాతకులకు మిగిలిన వారికంటే బాగా ఉంటుంది.

### ధనుస్సు

వృత్తిలో పోటీదారితో పోటీని ఎదుర్కొని అనుకూలతను సాధించ గలరు. రాజకీయ వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. స్థిరాస్థి వ్యవహారాల్లో మాత నావకాశాలు లభిస్తాయి. పూర్వాషాఢా నక్షత్ర జాతకులు మాత్రం జాగ్రత్తగా వ్యవహరించడం అవసరం.

### మకరం

ఈ దినం కూడా బాగా ఉండదు. ఉద్యోగంలో ముఖ్యమైన వ్యవహారాలు మీరు స్వయంగా చూడడం మంచిది. బంధువుల వ్యవహారాల్లో ... ధనిష్టా నక్షత్ర ... కంటే జాగ్రత్త అవసరం.

### కుంభం

ఇది వరకు మీరు అసాధ్యం అనుకొన్న వ్యవహారాలు కూడా యిప్పుడు సానుకూలపడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు కొంత వరకు లాభిస్తాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. పూర్వాభాద్రా నక్షత్ర జాతకులు మాత్రం జాగ్రత్తగా వ్యవహరించడం అవసరం.

### మీనం

వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ఉద్యోగంలో అధికారుల ఆదరాభిమానాలను పొందగలుగుతారు. ఉత్తరాభాద్రా నక్షత్ర జాతకులకు మిగిలిన వారికంటే బాగా ఉంటుంది.

—మహేష్

—o:o—

అలెగ్జాండ్రియా, మే 7: ఈ సంవత్సరం న్యూఢిల్లీలో జరుగనున్న వర్ధమానదేశాల ఆర్థిక సహకార మహాసభల్లో పాల్గొనవలసిందన్న భారత్ ఆహ్వానాన్ని ఐక్యఅరబ్ రిపబ్లిక్ అంగీకరించింది.

# ఏ. ఐ. సి. సి. సంఘానికి మైసూరు ప్రాతికూల్యం

## అన్ని రాష్ట్రాల వివాదాలను సంఘం పరిశీలించాలని నిజలింగప్ప స్పష్టీకరణ

బెంగుళూరు, మే 8: అఖిల భారత కాంగ్రెసు సంఘం ఉన్నతాధికార సంఘానికి 'శివం' మైసూరు, మహారాష్ట్ర సరిహద్దు వివాదాన్ని నివేదించటానికి మైసూరు అమోదించదని, ముఖ్యమంత్రి శ్రీ నిజలింగప్ప నిన్న యిక్కడ పత్రికా విలేఖరులతో చెప్పారు.

ఉన్నతాధికార సంఘం, యితర రాష్ట్రాల సరిహద్దు వివాదాలను కూడా పరిశీలించ తలపెట్టినట్లయితే, అలాంటి సంఘం ఏర్పాటును తాము అమోదించవచ్చని శ్రీ నిజలింగప్ప స్పష్టంచేశారు.

మైసూరు, మహారాష్ట్ర సరిహద్దులో స్వల్పమైన సర్దుబాట్ల విషయం మాత్రమే సంఘం పరిశీలించాలని ఆయన ఉద్ఘాటించారు. అలా కానిపక్షంలో, భాషా ప్రాతిపదికపై రాష్ట్రాల ఏర్పాటు, రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ చట్టంపై పార్లమెంటు నిర్ణయాల లక్ష్యాలనే సంఘం దెబ్బతీయగలదని ఆయన అన్నారు.

మైసూరు — మహారాష్ట్ర సరిహద్దు వివాదం, గోవా సమస్యలపై ప్రధానికి రెండు లేఖలు పంపనున్నామని ఆయన వెల్లడించారు.

గోవా భవితవ్యాన్ని అక్కడి ప్రజలే నిర్ణయించుకోవాలని ప్రధాని చేసిన ప్రకటనకు శ్రీ నిజలింగప్ప హర్షం వ్యక్తం చేశారు. గోవాను మహారాష్ట్రలో విలీనం చేయాలని జరుగుతున్న ఆందోళన, వాస్తవ పరిస్థితుల ఆధారంగా జరుగుతున్నది కాదని ఆయన అన్నారు.

మహారాష్ట్ర ఒత్తిడికి కాంగ్రెసు అధిష్ఠానవర్గం లొంగి పోతున్నదన్న అభిప్రాయాన్ని కలిగించటానికి ప్రయత్నం జరుగుతున్నా, ప్రభుత్వమూ, అధిష్ఠానవర్గమూ 'మౌనవహించి', త్వరపడి చర్య గైకొంటుందని తాము భావించటంలేదని ఆయన చెప్పారు.

"గోవాపై ఎట్టి హక్కులేనివారు ఈ సమస్య పరిష్కారం విషయంలో ఎందుకు తొందర పడుతున్నారో తమ కర్థం కావటంలేదని ఆయన అన్నారు.

—:o:—

### సభలు-సమావేశాలు

విజయవాడ పురపాలక సంఘం సాధారణ సమావేశం ఈ నెల 12 తేదీన మధ్యాహ్నం 4 గంటలకు పురపాలక సంఘ కార్యాలయంలో జరుగుతుంది.

## శ్రీ మాడపాటి బహుముఖ సేవ

### హైదరాబాద్ పౌరసన్మాన సభలో మేయర్ జోహార్లు

("ఆంధ్రపత్రిక" ప్రతినిధి)

హైదరాబాద్, మే 8: నగరంలో రాయల్ టాకీస్‌నుంచి అదిక్‌మెట్ వరకున్న రోడ్డుకు "మాడపాటి హనుమంతరావు రోడ్డు" అని నామకరణం చేయడానికి నగరపాలక సంఘం తీర్మానించిందని మేయర్ శ్రీమతి సరోజిని దేవి నిన్న ఇక్కడ ప్రకటించారు.

పద్మభూషణ మాడపాటి హనుమంతరావు గారికి హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్ ఆధ్వర్యంలో జరిగిన పౌర సన్మాన సభలో శ్రీమతి సరోజినీదేవి శ్రీ మాడపాటి దంపతులకు స్వాగతం చెబుతూ పై విషయాన్ని వెల్లడించారు.

రాష్ట్ర అంతరంగిక వ్యవహారాల మంత్రి శ్రీ మీర్ అహమ్మదు అలీఖాన్, పార్లమెంటు సభ్యుడు శ్రీ బూర్గుల రామకృష్ణారావు, శ్రీ అరవముడి అయ్యంగార్, పలువురు శాసన సభ్యులు అధికార అనధికారులు హాజరయ్యారు.

శ్రీ మాడపాటి హనుమంతరావుగారు కాంగ్రెసు నాయకుడుగా, సంఘ సంస్కర్తగా ప్రముఖ న్యాయవాదిగా, రాజకీయ వేత్తగా ప్రజలకు చేసిన పలు సేవలకు మేయర్ జోహార్లర్పించారు. నిరక్షరాస్యులైన ప్రజలను విద్యావంతులను చేయడానికి శ్రీ మాడపాటి వారు చేసిన కృషికి శ్రీ రాజ బహదూర్ వెంకట్రామరెడ్డి మహిళా కళాశాల స్థాపన ఒక నిదర్శనమని ఆమె అన్నారు. రాష్ట్ర శాసన మండలి అధ్యక్షులుగానే గాక, అంతకు మునుపు మూడు సంవత్సరాలు హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్ ప్రథమ మేయర్‌గా, కౌన్సిలర్‌గా, నగర కార్పొరేషన్ అభివృద్ధికి ప్రత్యేక కృషి సల్పారని ఆమె పేర్కొన్నారు.

శ్రీ మాడపాటి సన్మానానికి సముచిత రీతిన సమాధానమిస్తూ, నగర కార్పొరేషన్ రాజధాని అభివృద్ధి పట్ల కనబరుస్తున్న ఉత్సాహాన్ని శ్రద్ధను అభినందించారు.

బెల్గ్రేడ్, మే 7: యుగోస్లావియాలో పర్యటించడానికి గాను 5 గురు సభ్యులుగల భారత సైనిక ప్రతినిధి వర్గమొకటి నేడిక్కడకు విమానంలో వచ్చి చేరింది.



## శ్రీ జేమ్స్ ఎస్. రాజ్

### అంతర్జాతీయ ఆర్థిక సంస్థలో ఉన్నత పదవి

వాషింగ్టన్, మే 8: అంతర్జాతీయ ఆర్థిక సంస్థ డిప్యూటీ కార్య నిర్వహణ ఉపాధ్యక్ష పదవికి శ్రీ జేమ్స్ ఎస్. రాజును నియమించినట్లు ప్రపంచ బ్యాంకుకు, దానికి అనుబంధమైన ఈ అంతర్జాతీయ ఆర్థిక సంస్థకు (ఇంటర్నేషనల్ ఫైనాన్స్ కార్పొరేషన్‌కు) అధ్యక్షుడైన శ్రీ జార్జి డి.ఉడ్స్ యిప్పుడు ప్రకటించారు. ఈ సంస్థ కార్య నిర్వహణ ఉపాధ్యక్షుడు శ్రీ మార్టిన్ ఎం. రోసెన్. శ్రీ రాజా తన ఈ నూతన పదవిని జూన్ ప్రారంభంలో స్వీకరిస్తారు. వాషింగ్టన్‌లో పని చేస్తారు.

శ్రీ రాజా భారతీయుడు. 1964 నుంచి లాగోసులో నైగీరియన్ పారిశ్రామికాభివృద్ధి బ్యాంకులో మొదటి జనరల్ మేనేజర్‌గా పని చేస్తున్నారు. అంతకుముందు ఈయన భారత పారిశ్రామిక పరపతి, పెట్టుబడి సంస్థ ఇండస్ట్రియల్ క్రెడిట్ అండ్ ఇన్వెస్ట్‌మెంట్ కార్పొరేషన్ డిప్యూటీ జనరల్ మేనేజరుగా ఉన్నారు.

శ్రీ రాజా 1913 లో జన్మించారు. మద్రాసు క్రిస్టియన్ కళాశాలలోను, లండన్ విశ్వవిద్యాలయంలోను విద్యాభ్యాసం చేశారు. తర్వాత రంగూన్ విశ్వవిద్యాలయంలో బర్మా ఆర్థిక శాస్త్రోపన్యాసకుడుగా ఉన్నారు. పిదప సరఫరా, ఆహార, వ్యవసాయ మంత్రిత్వ శాఖలలో పెక్కు కార్య నిర్వాహక పదవులను, ఆర్థిక సలహాదారు పదవులను నిర్వహించారు. 1953లో ఈయన అంతర్జాతీయ ద్రవ్యనిధిలో 'మల్టిపుల్ కరెన్సీ ప్రాక్టీసెస్' శాఖ ప్రధానాధికారిగా చేరారు. 1956 లో ఈయనను అంతర్జాతీయ ద్రవ్యనిధి, ప్రపంచ బ్యాంకు తాలూకు భారత వ్యవహారాలకు ప్రత్యామ్నాయ కార్యనిర్వాహక డైరెక్టరుగా నియమించారు. తర్వాత ఈయన ప్రపంచబ్యాంకి ఆసియా శాఖ డైరెక్టర్‌గా పని చేశారు. 1959 లో తిరిగి భారతదేశానికి తిరిగివెళ్లి ఇండస్ట్రియల్ క్రెడిట్ అండ్ ఇన్వెస్ట్‌మెంట్ కార్పొరేషన్ డిప్యూటీ జనరల్ మేనేజరుగా నియమితులయ్యారు. 1964లో నుంచి పశ్చిమాఫ్రికా నైజీరియాలో (లాగోస్‌లో) పని చేస్తున్నారు.

అంతర్జాతీయ ఆర్థిక సంస్థను వివిధ దేశాలు తమ అర్థికాభివృద్ధికి 1956 లో నెలకొల్పాయి. 81 దేశాలు దీనికి ఇంతవరకు 9 కోట్ల 94 లక్షల డాలర్ల వాటాధనం చెల్లించాయి. ఇంతవరకు ఈ సంస్థ 34 దేశాలలో ముఖ్యంగా లాటిన్ అమెరికా, ఆసియా ఆఫ్రికా దేశాలలో పరిశ్రమలకు, ఇతర ప్రైవేటు సంస్థలకు 15 కోట్ల 50 లక్షల డాలర్ల సహాయం చేసింది.

# జయంతి షిప్పింగ్ కంపెనీ వ్యవహారాలు

### న్యూఢిల్లీ, మే 7 జయంతి నౌకా కంపెనీ అధ్యక్షుడు డాక్టర్ ధర్మతేజ తన కంపెనీ భవితవ్యంపై కేంద్రప్రభుత్వంతో అత్యవసరమైన చర్చలు జరపటానికి లండన్ నుంచి ఢిల్లీకి వస్తున్నారు

డాక్టర్ ధర్మతేజ ఇంత హడావుడిగా లండన్‌నుండి న్యూఢిల్లీకి ప్రయాణం కావటానికి రెండు కారణాలున్నాయి. ఈ కంపెనీకి ప్రభుత్వ ఋణం పెద్ద మొత్తంలో కావలసి ఉన్నది. అంతేకాకుండా ఇంతకుముందు రు. 3 కోట్ల ఋణానికి సంప్రదింపులు జరుపుతూ వచ్చిన కంపెనీ ఉపాధ్యక్షుడు శ్రీ లాల్‌జీ మెహ్రోత్రా రాజీనామా చేశారు.

రాజీనామా చేయటానికి ముందు శ్రీ మెహ్రోత్రా కంపెనీకి ప్రభుత్వంవద్ద నుండి వెంటనే రు. 4 కోట్లకు పైగా ఋణం కావలసి ఉంటుందని కేంద్ర రవాణా మంత్రిత్వ శాఖకు సూచించారు.

ఇప్పటికే ప్రభుత్వం ఈ కంపెనీకి రు. 20 కోట్ల ధనాన్ని ఋణంగా యిచ్చి ఉన్నది. కంపెనీ డైరెక్టర్ల మేనేజిమెంటును గూర్చి వివిధ ఆరోపణలు వచ్చాయి. ఆ ఆరోపణలపై ప్రస్తుతం దర్యాప్తు జరుగుతున్నది. ఈకారణంవల్ల మరికొంత ఋణం యివ్వటం ప్రభుత్వానికి యిష్టం లేదు.

కాని, ఈ కంపెనీ ఉనికిపైన, ఈ కంపెనీ నడిపే నౌకా ప్రయాణాలపైన దెబ్బతీసే టటువంటి పని చేయరాదని కూడా ప్రభుత్వం ఆతృత పడుతున్నది.

కంపెనీ డైరెక్టరు స్వచ్ఛందంగా కంపెనీ నిర్వహణను ప్రభుత్వానికి బదిలీ చేస్తే ప్రస్తుత చిక్కులనుండి కంపెనీని తప్పించటం సాధ్యంకాగలదని కొన్నాళ్ళక్రితం అధికారులు అభిప్రాయపడ్డారు.

కాని ప్రస్తుతం కంపెనీ చెల్లించుకోవలసిన సొమ్ము విపరీతంగా ఉండటంవల్ల రవాణా మంత్రిత్వశాఖ ఆలోచన ఈ విధంగా ఉన్నది. కంపెనీ, ప్రభుత్వానికి బదిలీ చేయవలసింది మేనేజిమెంటును కాదని, తన ఆస్తులలో కొన్నిటిని ప్రభుత్వానికి బదిలీ చేయాలని, అలా చేస్తే తప్ప కంపెనీకి ప్రజానిధులను యివ్వటం అవాంఛనీయమని రవాణా మంత్రిత్వశాఖ భావిస్తున్నది.

—:o:—

## పరీక్ష హాలులో విద్యార్థుల కొట్లాట

కలకత్తా, మే 7: కలకత్తా విశ్వవిద్యాలయం భవనంలో నేడు బి.ఎస్.సి. పరీక్షకు కూర్చొన్న విద్యార్థుల మధ్య కొట్లాట జరగడంవల్ల ఆరుగురు గాయపడ్డారు.

నివాలజీ ప్రశ్నపత్రం చాలా కష్టంగా వున్నదని పరీక్ష హాలులో కొంత మంది విద్యార్థులు కేకలు వేస్తూ జవాబులు వ్రాస్తున్న విద్యార్థులనుంచి జవాబు పేపర్లను లాగివేసుకొన్నారు. పరీక్ష వ్రాయడానికి ఇష్టపడిన విద్యార్థులు దీనిని వ్యతిరేకించారు. ఇది తీవ్ర రూపందాల్చి కొట్లాటగా పరిణమించింది. దీని ఫలితంగా కొన్ని బల్లలు, కుర్చీలు విరిగిపోయాయి.

విశ్వవిద్యాలయ అధికారులు పరిస్థితిని అదుపులోనికి తెచ్చి, పరీక్షను మామూలుగా నిర్వహించారు.

## కుటుంబ నియంత్రణకు వయఃపరిమితి కలదా?

### రాజ్యసభలో ప్రశ్నలు

న్యూఢిల్లీ, మే 7: కుటుంబ నియంత్రణకు శస్త్ర-చికిత్స చేయించుకునే వ్యక్తులకు వయః పరిమితి ఉన్నదా ?

బాగా ముసలితనం వచ్చేవరకు కూడా పురుషునిలో శుక్లేంద్రియాలు ఉంటాయనడానికి చాలా నిదర్శనాలు కలవని, 60 సంవత్సరాలు పైబడిన వారు కూడా కుటుంబ నియంత్రణకు శస్త్రచికిత్స చేయించుకోవడంలో తప్పులేదని డాక్టర్ చంద్రశేఖర్ వివరించారు.

కుటుంబ నియంత్రణ శస్త్ర చికిత్స చేయించుకున్న వారికి డబ్బు ఇస్తారన్న ప్రకటనపై 60 ఏండ్ల పైబడి వారు కూడా దీనికి ఆకర్షింప బడడం లేదా ? అని రాజ్య సభలో శ్రీ వాజపాయి అడిగిన ప్రశ్నకు పై విధంగా సమాధానం ఇవ్వడం జరిగింది.

శ్రీ వాజపాయీ ప్రశ్నకు డాక్టర్ చంద్రశేఖర్ సమాధానమిచ్చినందుకు ఆరోగ్యశాఖ ఉపమంత్రి శ్రీ బి. ఎస్. మూర్తి హర్షం తెలిపారు.

## ఒరిస్సాలో క్షామ పరిస్థితి

### అదుపులో ఉన్నట్లు సుబ్రహ్మణ్యం ప్రకటన

భువనేశ్వర్, మే 7: ఒరిస్సాలో క్షామ పరిస్థితులు యిప్పుడు బాగా అదుపులో ఉన్నాయని, ఇప్పుడు చేయవలసిందల్లా భవిష్యత్తుకు రక్షణ కలుగ చేయడమని కేంద్ర ఆహార శాఖా మంత్రి శ్రీ సుబ్రహ్మణ్యం నేడిక్కడ పత్రికా ప్రతినిధులతో మాట్లాడుతూ చెప్పారు.

శ్రీ సుబ్రహ్మణ్యం రాష్ట్రంలో రెండు రోజులు పర్యటించిన అనంతరం ఢిల్లీకి బయలుదేరబోయే ముందు పత్రికల వారితో మాట్లాడుతూ, యీ వారం ప్రారంభంలో దుర్భిక్ష ప్రాంతాలలో పర్యటించిన కేంద్ర ప్రభుత్వ బృందం నివేదికల ఆధారంగా తాము పై విషయం చెప్పినట్లు అన్నారు.

దుర్భిక్ష ప్రాంతాలలో ఆకలి చావులు సంభవించలేదన్న ఒరిస్సా ప్రభుత్వ నివేదికతో యీ బృందం ఏకీభవించిందని కూడా ఆయన చెప్పారు. మరణాలు యితర కారణాలవల్ల సంభవించాయన్నారు.

దుర్భిక్ష ప్రాంతాలలో సహాయ కార్యక్రమాలను గురించి శ్రీ సుబ్రహ్మణ్యం వివరించారు.

క్షామ పరిస్థితుల నివారణపై రాష్ట్ర ప్రభుత్వ సమర్థతను గురించి తీర్పు

# భారత్‌తో ఇండోనేషియాకు ఏర్పడ్డ అభిప్రాయ భేదాలు

## తొలగించుకోవాలని వాంఛిస్తున్నట్లు జకార్తా విదేశాంగ మంత్రి ఆకాంక్ష

జకార్తా, మే 7:

భారత దేశంతో తమ దేశానికి యేర్పడ్డ అభిప్రాయ భేదాలను తొలగించుకోవాలని అభిలషిస్తున్నట్లు ఇండోనేషియా విదేశాంగ మంత్రి ఆదం మాలిక్ అన్నారు.

గురువారమునాడు పార్లమెంటులో విదేశాంగ విధానంమీద ఒక ముఖ్యమైన ప్రకటనచేస్తూ, భారతదేశం ప్రపంచదేశాల సమాజంలో అతి ముఖ్యమైన దేశం అన్నమాట మరచిపోరాదు అన్నారు. అయితే పాకిస్తాన్‌తోకూడా మరింతగా తమ సంబంధాలను బలపరచుకోవాలని జకార్తా కోరుతున్నదని ఆయన అన్నారు.

ముఖ్యంగా ఈ ప్రకటనలో మలేసియా గురించి ఆదంమాలిక్ ప్రస్తావించారు.

చెప్పే విధానాన్ని విరమించాలన్నారు.

తప్పులు చేయడం సహజమేనని, అయితే తాము రాష్ట్ర ప్రభుత్వం పనిపై తీర్పు చెప్పడం లేదని, రాష్ట్రానికి సహాయం చేయడానికి మాత్రమే వచ్చామని ఆయన అన్నారు.

## ప్రపంచ ఆరోగ్య సంస్థలో పెకింగ్ ప్రభుత్వానికి స్థానం

### ఫ్రెంచి ప్రతినిధి సమర్థన

జెనీవా, మే 8: ప్రపంచ ఆరోగ్య సంస్థలో కమ్యూనిస్టు చైనాకు ప్రాతినిధ్యం కల్పించాలని ఫ్రాన్సు కోరింది.

ప్రపంచ ఆరోగ్య సంస్థ 19 వ మహాసభలో ఫ్రెంచి ఆరోగ్య వైద్య పరిశోధనా సంస్థ డైరెక్టర్ తమ ప్రభుత్వ వైఖరిని పై విధంగా తెలిపారు. అల్బేనియా, బల్గేరియా, కాంబోడియా, జెకోస్లోవేకియా, మంగోలియా కూడా అదే విధంగా కోరాయి.

# హిందీని పూర్తిగా జాతీయ భాష చేయనప్పుడు ప్రమాదం

## —శ్రీ మొరార్జీ హెచ్చరిక

అలహాబాద్, మే 7:

హిందీని పూర్తి అర్థంలో జాతీయభాషగా చేయకపోయిన పక్షంలో దేశం విచ్ఛిన్నం అయిపోగలదని శ్రీ మొరార్జీ దేశాయ్ నేడు హెచ్చరించారు.

అలహాబాద్ విశ్వవిద్యాలయం.విశ్వవిద్యాలయ గ్రాంట్ల సంఘం కలసి ఏర్పాటుచేసిన హిందీ అభివృద్ధి అనే విషయంపై గోష్ఠిలో మాట్లాడుతూ శ్రీ దేశాయ్ పై విధంగా హెచ్చరించారు.

"20 కోట్లమంది మాట్లాడేహిందీ జాతీయ భాష అనటంలో సందేహం ఏమీలేదు" అని ఆయన అన్నారు. స్వాతంత్ర్యం వచ్చి 18 ఏండ్లు అయినా ఇంకా రాష్ట్రాలన్నింటిలో అధికార వ్యవహారం హిందీలో జరుపకుండా ఉండటం గురించి ఆయన విచారం ప్రకటించారు.

హిందీ ప్రాంతీయ భాషలను విధ్వంసం చేస్తుందనే హిందీ వ్యతిరేకుల వాదన సత్యం అయినదికాదని ఆయన చెప్పారు.

హిందేతర భాషా రాష్ట్రాలను హిందీలో వ్యవహారం సాగించాలని అడిగేముందు, హిందీ రాష్ట్రాలు హిందీలో వ్యవహారం సాగించడం మొదలెట్టాలి అని ఆయన అన్నారు. హిందీ భాష మాట్లాడే రాష్ట్రాలలో దానిని విశ్వవిద్యాలయం బోధనాభాషగాచేయాలనికూడా శ్రీ దేశాయ్ సూచించారు.

హిందీని సంస్కృత పదాలతో జటిలంచేయకుండా ఇతర భారతీయ భాషల పదజాలాన్ని స్వీకరించి హిందీ[illegible] సరళతరం చేయాలని [illegible]య్ పేర్కొన్నారు.

## భావే, కాలేల్కర్‌లకు సాహిత్య వాచస్పతి గౌరవ డిగ్రీలు

### హిందీ విశ్వవిద్యాలయంచే ప్రదానం

అలహాబాద్, మే 7: హిందీ సాహిత్య సమ్మేళనంవారు నిర్వహించే హిందీ విశ్వవిద్యాలయం స్నాతకోత్సవంలో ఆచార్య వినోభాభావే, కాకా సాహెబ్‌కాలేల్కర్‌లకు 'సాహిత్య వాచస్పతి' గౌరవ బిరుదం పరోక్షంగా ప్రదానంచేయబడింది. హిందీ సాహిత్య సమ్మేళనమును కీ.శే. పండిత మదనమోహనమాలవ్యా స్థాపించారు. హిందీని అభివృద్ధిచేసే లక్ష్యంతో ఇది స్థాపించడం జరిగింది.

స్నాతకోపన్యాసం శ్రీ మొరార్జీదేశాయ్ గావించారు. సేట్ గోవిందదాస్ అధ్యక్షత వహించారు.

ప్రఖ్యాత హిందీపండితులు ముగ్గురికికూడా 'వాచస్పతి' గౌరవ బిరుదం ప్రదానంచేశారు. వీరు శ్రీ రామచంద్రవర్మ, శ్రీ హరిభావ్ ఉపాధ్యాయ, పండిత ముకుటధరపాండేగారలు.

ఇరువురు హిందీ గ్రాడ్యుయేట్ విద్యార్థులకు సాహిత్య మహోపాధ్యాయ డిగ్రీ ఇవ్వటం జరిగింది.





Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd. by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhi Nagar, Vijayawada-3. Editor S. Sambhu Prasad. Phone: Vijayawada 2667, 2660.